శ్రీ [illegible] RAJAHMUNDRY [illegible] గారిచే స్థాపింపఁబడియె.

సంపుటము. III | సెప్టెంబరు. 1913. | సంచిక. 5

# మానవసేవ

నీతి మత సంఘ పరిశ్రమ భాషావిషయములఁ జర్చించు

## సచిత్ర మాసపత్రిక

రాజమహేంద్రవరము



పత్రికాసంపాదకులు

నాళము కృష్ణారావు

సత్యవోలు అప్పారావు.

సత్యవోలు అప్పారావుచే

శ్రీవిద్యానిలయ ముద్రాశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

రాజమహేంద్రవరము.

1913.

# విషయములు



## చిత్రపటములు.



యేసు చైతన్యుల యేకత్వము

# స్తోత్రము.

క. చిత్రింబులు త్రైలోక్యప
విత్రింబులు, భవలతాలవిత్రింబులు, స
న్మిత్రింబులు, మునిజనవన
చైత్రింబులు దేవదేవుసంస్తోత్రింబుల్. 219

మాలిని. నిరుపగుణజాలా! నిర్మలానందలోలా!
దురితఘనసమీరా! దుష్టపాపప్రహారా!
సరసవినుతసూరీ! సర్వలోకోపకారీ!
గురుబుధసుఖకర్తా! కుంభినీచక్రభర్తా! 220

మాలిని. భువనభరనివారీ! పుణ్యరక్షానుసారీ!
ప్రవిమలగుణజాలా! భక్తాలోకానుపాలా!
భవతిమిరదినేశా! భానుకోటిప్రకాశా!
కువలయహితకారీ! ఘోరపాపప్రహారీ! 221

తరల. ధరణిధారణ! సృష్టికారణ! తాపసస్తుతిపారణా!
సరసపోషణ! సత్యభాషణ! సత్కృపామయభూషణా!
దురితతారణ! దుఃఖవారణ! దుష్టతత్వవిదారణా!
పరమపావన! విశ్వభావన! భవ్యయోగిజనావనా! 222

క. తారల నెన్నఁగ వచ్చును
భూరేణుల లెక్కపెట్టఁ బోలును ధాత్రిన్
నారాయణ! నీగుణగణ
మారయ వర్ణింప వశమె ప్రాజ్ఞుల కైనన్? 223

క. జననము నైశ్వర్యంబును
ధనమును విద్యయును గలమదచ్ఛన్నులకుం
చనగోచరుఁ డగునిన్నున్
వినుతింపఁగ లేరు నిఖిలవిబుధస్తుత్యా! 224

క. సదసత్తత్త్వపరాపర
పదమం బగు నిన్నుఁ బొగడ సన్మునివర్యుల్
పెదవులు గదలుప వెఱతురు
వదలక నినుఁ బొగడ నెంతవారము దేవా! 225

క. ఎఱిఁగినవారికి యెఱుంగమి
యెఱుఁగమె! బహుభాష లేల? యీశ్వర! నీ పెం
పెఱుఁగ మనోవాక్కులకుఁ
గుఱి సేయం గొలఁది గాదు గుణరత్ననిధీ! 226

మ. అమలుల్, సిద్ధులు, సంయమీశ్వరులు, బ్రహ్మజ్ఞుల్ సతాత్పర్యచి
త్తములన్ నిన్ను బహుప్రకారముల నిత్యంబున్ విచారించి పా
రము ముట్టన్ నుతి సేయ నోప రఁట; యప్రాజ్ఞుండ, మూఢుండ, గ
ర్వమదోద్రిక్తుఁడఁ, బాపుఁడన్, జడమతిన్ వర్ణింప శక్తుండ నే? 227

శా. నీపాదాబ్జము మౌనిపూజ్యము గదా! నీసేవ సంసారసం
తాపధ్వంసిని యౌఁ గదా! సకలభద్రశ్రేణులం బ్రీతితో
నాపాదింతు గదా ప్రపన్నులకుఁ గాలాధీశ! కాలంబు ని
ర్వ్యాపారంబు గ దయ్య; చాలరు నినున్ వర్ణింప నెవ్వారలున్. 228

సీ. భూతాత్మ! భూతేశ! భూతభావనరూప! దేవ! మహాదేవ! దేవవంద్య!
యీలోకముల కెల్ల నీశ్వరుండవు నీవ; బంధమోక్షములకుఁ బ్రభుఁడ వీవ;
యార్తశరణ్యుండ వగుగురుండవు; నిన్నుఁ గోరి భజింతురు కుశలమతులు;
సకలసృష్టిస్థితిసంహారకర్తవై బ్రహ్మవిష్ణుశివాఖ్యఁ బరగు దీవు;

ఆ. పరమగుహ్యమైనబ్రహ్మంబు సదసత్త
మంబు నీవ; శక్తిమయుఁడ వీవ;
శబ్దయోని వీవ; జగదంతరాత్మవు;
నీవ ప్రాణ మరయ నిఖిలమునకు 229

క. నీయంద సంభవించును;
నీయంద వసించియుండు నిఖిలజగములున్;
నీయంద లయముఁ బొందును;
నీయుదరము సర్వభూతనిలయము దేవా! 230

సీ. అగ్ని ముఖంబు; పరాపరాత్మక మాత్మ; కాలంబు గతి; రత్నగర్భ పదము;
శ్వసనంబు నీయూర్పు; రసన జలేశుండు; దిశలు గర్ణంబులు; దివము నాభి;
సూర్యుండు గన్నులు; శుక్లంబు సలిలంబు; జఠరంబు జలధులు; సదలు శిరము;
సర్వౌషధులు రోమచయములు; శల్యంబు లదులు, మానస మమృతకరుఁడు;
తే. ఛందములు ధాతువులు; ధర్మసమితి హృదయ;
మాస్యసంచయ ముపనిషదాహ్వయంబు
నయిననీరూపు పరతత్త్వ మై, శివాఖ్య
మై, స్వయంజ్యోతి యై యొప్పు నాద్య మగుచు. 231
ఆ. మూఁడుమూర్తులకును, మూఁడులోకములకు,
మూఁడుకాలములకు మూల మగుచు
భేద మగుచుఁ దుది నభేద మై యొప్పారు
బ్రహ్మ మనఁగ నీవ పరమపురుష! 232
తే. అవ్యయుండవ; వనంతుండవ; వచ్యుతుండవ;
వాదిమధ్యాంతశూన్యుండవ; వఖిలధృతివి;
నిఖిలమం దెల్ల వర్తింతు వీవు దగిలి;
నిఖిల మెల్లను నీయందు నెగడు నీశ! 233
క. పటుఘననీరంధ్రితమః
పటలపరీవృతజగత్ప్రపంచమునకు నె
క్కటిలోచన మై మహితో
త్కటరుచి వెలుఁగుదువు భానుకైవడి ననఘా! 234
క. పరమాణువు మొదలుగఁ గొని
పరమము దుదిగాఁగ మధ్య పరికీర్తనచే
స్థిరుఁడవు త్రియావిదుఁడ వై
సరి స్త్వాద్యంతమధ్యసదృశగతుఁడ వై. 235
క. సర్వము నీలోనిది గా
సర్వాత్ముఁడ వాత్మవస్తుసంపన్నుఁడ వై
సర్వమయుఁడ వగునీకును
సర్వేశ్వర! లేవు లోనుసంధులు వెలియుఁన్. 236

తే. ఆత్మవలనఁ గలిగి యమరుదేహాదుల
నాత్మకంటె వేఱు లవి యటంచుఁ
దలఁచువాఁడు మూఢతముఁడు గావునఁ జూడ
విశ్వ మెల్ల నీవ వేఱు లేదు. 237

సీ. అట్టిట్టి దనరాని దై, మొద లై, నిండుకొన్న దై, వెలుఁగుచు గుణము లేని
దై, యొక్కచందంబు దై, కల దై, నిర్విశేష మై, క్రియ లేక చెప్ప రాని
దేరూప మని శ్రుతు లెప్పుడు నొడివెడి నారూప మగుచు నధ్యాత్మదీప
మై బ్రహ్మరెండవయర్థంబుతుది జగంబులు నశింపఁగఁ బెద్దభూతగణము

ఆ. సూక్ష్మభూతమందుఁ జొరఁగ నాభూతంబు
ప్రకృతిలోనఁ జొరఁగఁ బ్రకృతి వోయి
వ్యక్తమందుఁ జొరఁగ న్యక్త మడంగను
శేషసంజ్ఞ నీవు సెలువ మగుదు. 238

సీ. రూఢిఁ బ్రధానపూరుషనాయకుండవు, భగవంతుఁడవు జగత్ప్రభుఁడ వైన
నీకంటె నన్యులఁ గైకొని తగిలినయాత్మలు భవభయం బందుదు రది
గావున నీయాజ్ఞఁ గడవంగ నోడుటఁ జేసి వాయువు వీచు; శిఖి వెలుంగు;
నినుఁడు దపించుఁ; దా నింద్రుఁడు వర్షించు; భయ మంది మృత్యువు పరువు వెట్టు

తే. గాన విజ్ఞానవైరాగ్యకలిత మైన
భక్తియోగంబునం జేసి పరమపదము
కొఱకు నయ్యోగివరులు ద్వచ్చరణభజను
లగుచుఁ జరియింపుదురు నిర్భయాత్ము లగుచు. 239

సీ. దేవ! జగన్మయ! దేవేశ! జగదీశ! కాలజగద్రూపకస్వరూప!
యఖిలభూతములకు నాత్మయు హేతువు నైనయీశ్వరుఁడ వాద్యంతములకు
మధ్యంబు బయలును మఱి లోపలయు లేక పూర్ణ మై యమృత మై భూరిసత్య
మానందచిన్మాత్ర మవికార మాద్య మనన్య మశోకంబు నఖిలగుణము.

తే. సంభవస్థితిలయముల సంగరహిత
మైనబ్రహ్మంబు నీవ; నీయంఘ్రియుగము
నుభయసంగవిసృష్టు లై యున్నమునులు
గోరి కైవల్యకాము లై కొల్తు రెపుడు. 240

చ. వెఱచినవాని, దైన్యమున వేఁదుఱు నొందినవాని, నిద్ర మై
మఱచినవాని, సౌఖ్యమున మద్యము ద్రావినవాని, భగ్నుఁడై
పఱచినవాని, సాధుజనభావమువానిని, గావు మంచు వా
చఱచినవానిఁ, గామినులఁ జంపుట ధర్మము గాదు ధారుణిన్. 61

క. బాలాజనశాలాధన। లీలావనముఖ్యవిభవలీనమనీషా
లాలను లగుమానవులను। గాలము వంచించు దురవగాహము సుమతీ! 62

క. సాధువు లగుజంతువులకు। బాధలు గావించుఖలుల భంజింపనిరా
జాధమునాయుస్స్వర్గ। శ్రీగనములు వీటిఁబోవు సిద్ధము సుమ్మీ. 63

క. దుష్టజననిగ్రహంబును। శిష్టజనానుగ్రహంబుఁ జేయఁగ నృపులన్
సృష్టి విధించెఁ బురాణ। ద్రష్టలు సెప్పుదురు పరమధర్మం బరయన్. 64

ఉ. ఈరని లోకులం గినిసి యొగ్గులు పల్కనివాఁడు, గోరికల్
గోరనివాఁడు, గూటువులఁ గూడనివాఁడు, వృథా ప్రపంచముం
జేరనివాఁడు, దైవగతిఁ జేరినలాభముఁ జూచి తుష్టుఁడై
నేరనివానిచందమున నేర్పులు సూపనివాఁడు ధన్యుఁడౌ. 65

క. కామింపకయును సర్వముఁ। గామించియు నైన ముక్తిఁ గామించి తగన్
లో మించి పరమపురుషుని। నేమించి భజించుఁ దత్త్వనిపుణుఁడు పేర్మిన్. 66

క. ధృతచిత్తుఁడు శాంతుఁడు ని। యతపరిభాషణుఁడు సుమహితాచారుఁడు వ
ర్ణితహరిమంగళగుణుఁడును। మితవన్యాశనుఁడు నగుచు మెలఁగఁగ వలయున్ 67

క. అతిపరిశుద్ధులు లజ్జా। న్వితులు మహోదారు లధికనిర్మలు లాత్మ
స్తుతిపరనిందలదోషము। లతిహేయము లని తలంతు రాత్మల నెపుడున్ 68

క. వందిజనంబులు లోకము। లందు నవిదితవరకర్ము లగుభూపతులన్
నందించు టవశ్యం బై। నం దగదు నుతింప శిశుజనంబులపగిదిన్. 69

ఆ. మఱచి కాననమునఁ గొఱవిదయ్యముఁ గాంచి। యగ్నిఁ గోరి వెంట నరుగుమాడ్కి
గాంచనంబు గోరి కలవారియిండ్లపం। చలను దిరుగు నరుఁడు చలన మంది. 70

ఆ. అల్పధనుఁడు విశ్రమాస్థానములఁ దృప్తి। బొంద కొరులధనముఁ బొందఁ గోరి
యరిగి వారివలన నవమానములఁ బొంది। యధిక మైనదుఃఖ మనుభవించు. 71

తే. కోరి కర్మంబు నడపెడువారి కెల్లఁ। గలితశుభములు నశుభముల్ గలుగుచుండు
నరయఁగా దేహి గుణసంగి యైనయపుడె। పూని కర్మంబు సేయక మానరాదు. 72

క. ప్రకృతమునఁ దా నొనర్చిన। సుకృతము దుష్కృతము నెంత చూడఁగ నంతే
వికృతి గని యనుభవించును। సకృతమతిం దత్ఫలంబు నతినిపుణుం డై. 73

ఉ. తప్పక యర్భకావళికిఁ దల్లియుఁ దండ్రియు, నేత్రపంక్తికిన్
ఱెప్పలు, నాతికిం బతియు, ఱేఁడు ప్రజావళి కెల్ల, నర్థికిం
బొప్ప గృహస్థు, మూఢులకు నుత్తము లెన్న సమస్తబాంధవుల్
ముప్పునఁ గావ లేనికడుమూర్ఖులు గారు నిజాలచుట్టముల్. 74

క. కట్టా! త్రికరణ మెఱుఁగక। పుట్టినదురితముల నపుడ పొలియింపనియా
కట్టిడి దేహం బుడిగినఁ। గొట్టాడును బిట్టు నరకకూపంబులలోన్. 75

ఉ. కావునఁ గాలకింకరవికారము గానకమున్న, మృత్యుదు
ర్భావనఁ జిత్తముల్ వెడగుపాటును జెందకమున్న, మేనిలో
జీవము వెల్గుచుండఁ దనచెల్వము దప్పకమున్న పన్నుఁగాఁ
బావనచిత్తుఁ డై యఘముఁ బాయుతెఱం గొనరింపఁగాఁ దగున్. 76

క. కాలం బెడ గని పాపము। మూలముఁ జెఱుపంగ వలయు మును రోగములం
దేలినదోషము నెఱుఁగుచు। వాలాయము దాని నడచు వైద్యునిభంగిన్. 77

క. కర్మము గర్మముచేతను। నిర్మూలము గాదు తెలియ నేరక తా నే
కర్మము సేసినఁ దత్ప్రతి। కర్మం బొనరింప వలయుఁ గలుషవిదూరా! 78

క. హితవు గలకుడుపు మతి రు। గ్వితతులఁ బొడమంగ నీనివిధమున నతిస
ద్వ్రతుఁ డైనవాఁడు నిర్మల। మతిచే నఘరాశి నెల్ల మట్టము సేయున్. 79

క. చిరకాలతపము నైనను। హరియింపఁగ నోపుఁ జిత్త మని పెద్దలు న
మ్మరు జారులకున్ జారిణి। కరణిని నడరించు మనసు కామాదులకున్. 80

క. ప్రాణేచ్ఛ వచ్చి వొచ్చిన। ప్రాణుల రక్షింప వలయుఁ బ్రభువుల కెల్లం
బ్రాణుల కిత్తురు సాధులు। ప్రాణంబులు నిమిషభంగురము లనుచు ధృతిన్. 81

క. పరహితము సేయ నెవ్వఁడు। పరమహితుం డగును భూతపంచకమునకున్
బరహితమె పరమధర్మము। పరహితునకు నెదురు లేదు భావింపంగన్. 82

ఆ. అన్న మైనఁ దోయ మైన ద్రవ్యం బైన। శాక మైనఁ దనకు జరగుకొలఁది
నతిథిజనుల కడ్డ మాడక యిడ రేని। లేనివారు పుడమి లేనివారు. 83

మ. చెలియే మృత్యువు? చుట్టమే యముఁడు? సంసేవార్థులే కింకరుల్?
శిలలం జేసెనె బ్రహ్మ దన్ను? దృఢమే జీవంబు? నోచెల్లరే!
చలితం బౌట యెఱుంగ కీకపటసంసారంబు నిక్కంబుగాఁ
దలఁచున్ మూఢుఁడు సత్యదానకరుణాధర్మాదినిర్ముక్తుఁ డై. 84

ఆ. ధారుణీసురులకుఁ దపము విద్యయు రెండు। ముక్తి సేయుచుండు ముదముతోడ
దుర్వినీతు లగుచు దుర్జను లగువారి। కివియుఁ గీడు సేయు కేల యుండు? 85

క. మానుషదేహము గలుగుట। భూనాయక! దుర్లభంబు పుట్టినమీఁదన్
దానముఁ బరోపకారము। భూనుతకీర్తియును వలదె పురుషున కెందున్? 86

క. పగతురు తనపై కత్తిన। మగటిమి వాటింప లేక మగతన మెల్లన్
మగువలకౌఁగిటఁ జూపెడు। మగవాఁ డగుకంటె మగఁడు మగువగు టొప్పున్ 87

ఆ. అధముఁ డైనవాని కాలగుకంటె న। త్యధికునింట దాసి యగుట మేలు
హీనుఁ బొంది మేను హింసింపఁగా నేల? యువతిజనుల కూరకుంట లెస్స 88

మ. తలఁపుల్ చిమ్ములు; మాట లుజ్జ్వలసుధాధారల్; విభుం డైనపు
వ్విలుతున్ మెచ్చర, యన్యులం దలఁతురే? విశ్వాసమున్ లేదు? క్రూ
రలు; తోడుంబతి నైనఁ జంపుదు; రధర్మల్; నిర్దయల్; చంచలల్;
వెలయాం డ్రెక్కడ? వారివేషములు వేదాంతసూక్తంబులే? 89

ఆ. ధనము వీధిఁ బడిన దైవవశంబున। నుండుఁ బోవు మూల నున్న నైన
నడవి రక్ష లేనియబలుండు వర్ధిల్లు। రక్షితుండు మందిరమునఁ జచ్చు. 89

మ. చెలులుం దల్లులు దండ్రు లాత్మజులు సంసేవ్యుల్ సతుల్ చారుని
ర్మలగేహంబు లటంచుఁ గూర్తురు మహామాయాగుణభ్రాంతు లై
కలలోఁ దోఁచినయర్థముల్ నిజములే? కర్మానుబంధంబులం
గలుగున్, సంగము లేక మానుఁ బిదపం గర్మాంతకాలంబునన్. 90

ఆ. విషయాసక్తు లైనవిబుధాహితులతోడ। మనికి వలదు ముక్తిమార్గవాంఛ
సాదిదేవు నీశు నాశ్రయింపుఁడు ముక్తి। సంగజనులఁ గూడి శైశవమున. 91

శా. హాలాపానవిజృంభమాణమదగర్వాతీతదేహోల్లస
ద్బాలాలోకనశృంఖలానిచయసంబద్ధాత్ములై లేశమున్
వేలానిస్సరణంబు గానక మహావిద్వాంసుఁడుం గామినీ
హేలాకృష్టకురంగశాబక మగున్, హీనస్థితిన్ వింటిరే? 92

క. విత్తము సంసృతిపటలము । ఎత్తము కామాదివైరివర్గంబుల నేఁ
డిత్తము చిత్తము హరికిని । జొత్తము నిర్వాణపదము శుభ మగు మనకున్. 93

క. పాలింపుము శేముషి, ను । న్మూలింపుము కర్మబంధముల సమదృష్టిం
జాలింపుము సంసర్గము । గీలింపుము హృదయమందుఁ గేశవభక్తిన్ 94

క. పశువులఁ బొరిగొని మఖములు । విశదములుగఁ జేయుబుధుని వీక్షించి తమున్
విశసనము సేయునో యని । క్రిశిమన్ బెగడొందు భూతగణము నరేంద్రా 95

క. చెడుఁ గరులు హయలు ధనములు । జెడుదురు నిజసఖులు సుతులుఁ జెడుచెనటులకుం
జెడక మనునట్టిగుణులకుఁ । జెడనిపదార్థములు విష్ణుసేవానిరతుల్. 96

క. పనుపక చేయుదు రధికులు । పనిచిన మధ్యములు వొందుపఱతురు, తండ్రిల్
పని చెప్పి కోరి పనిచిన । ననిశము మాఱాడుపుత్రు లధములు తండ్రీ! 97

క. వెడవిలుతుకేళిఁ జిగురా । కడిదపువ్రేటునకు లోఁగి యతిమోహితుఁడై
విడునక సతులం దగిలెడు । జడునకు నెక్కడివి బుద్ధిచాతుర్యంబుల్? 98

క. అదలవు ప్రాణము, లదలినఁ । గదలవు సర్వాంగకములుఁ, గదలుచు నుండన్
వదలదు బిగువులు, వదలినఁ । దుది లే దీకృష్ణ దీనిఁ ద్రుంపఁగ వలయున్. 99

క. ముదిసెను దంతావళియును । ముదిసెను కేశములు దనువు ముదిసెం దనకున్
ముదియ నివిరెండు సిక్కను । బ్రదికెడితీపియును విషయపక్షస్పృహయున్ 100

క. కడ లే దాశాలతకుం । గడఁ జూడఁగఁ గాన రాదు కడఁ గనిరేనిన్
గడుముదమున సంసారము । గడఁ గందురు తత్త్వవిదులు కారుణ్యమయా! 101

క. బలవంతుఁ డైనవాఁడే । కులహీనుం డైన దొడ్డగుణవంతుఁ డగున్
గలిమియు బలిమియుఁ గలిగిన । నిలలోపల రాజతం డె యే మన వచ్చున్? 102

క. ధర్మము సత్యముఁ గీర్తియు । నిర్మలదయ దేవభక్తి నిరుపమఘనస
త్కర్మ మహింసావ్రతమును । నర్మిలి గలవారి పుణ్యు లవనీనాథా! 103

గీ. కనులపండువు సేయుచుఁ గానఁబడిన
సర్పమును బ్రేమ లాలించుజనుఁడు గలఁడె?
పండితులు నిన్ను మెచ్చరు భ్రష్టుఁడ వని
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 36

గీ. అక్షరం బొక్క టైనను గుక్షిలోనఁ
గంచుకాగడఁ గొని చూడఁ గానఁబడదు;
ధనము కల దని గర్వింప ఘనుఁడ వగుదె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 37

గీ. సరసు లగువారు శాస్త్రార్థచర్చ సలుప
వారిదరిఁ జేరి తగనిమర్యాద మాడ
పరిహాసింతురు కావునఁ బలుక వలదు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 38

గీ. ధర్మమార్గంబులను దెల్ప ధార్మికుఁడవె?
సద్గుణంబులు బోధింప శాంతమతివె?
పరుల వంచించి సతతంబు బ్రతుకునీవు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 39

గీ. సకలవిద్యల నేర్చినసరసుఁడ వని
ధనము యశమును గలిగినధన్యుఁడ వని
విఱ్ఱవీఁగినమాత్రాన విబుధుఁ డనరు;
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 40

గీ. ఉపనిషద్వాక్యముల నేర్చియుందు వేని,
జపతపంబులఁ బొద్దులు జరపు దేని,
చిత్తమును బరిశుద్ధిగాఁ జేయఁ గలవె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 41

గీ. ఆశ లుడుగక వైరాగ్య మబ్బఁ బోదు;
క్రోధ ముడుగక శాంతంబు కుదురుపడదు;
శాంతముసఁ గాని హృదయంబు చక్కఁబడునె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 42

గీ. భార్య యెవ్వతె? సంసారభార మెద్ది?
పుత్త్రు లెవ్వరు? కుమతి! యీబూటకములు
మిథ్య లని నమ్మి జ్ఞాని వై మెలఁగు మెపుడు
మూఢుడా! వేషభాషల మురియఁ బోకు. 43

గీ. క్రోధమోహాలోభంబులు కూడి యుండ
నెంతకాలంబు బ్రతికిన నేమిఫలము?
వయసు ముదిరిన వాంఛలు వదల కున్న
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 44

గీ. పెద్దకాలంబు జీవించి సుద్ది తెలిసి
చేయుతప్పులఁ గప్పినచెనఁటిమనసు
ధర్మసత్యశౌచంబులఁ దాల్ప గలదె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 45

గీ. పాపములఁ జేసి ప్రజలు నిర్ణ భర్తుఁ డనఁగ
మసలఁజాలుదు, వద్దాన మనసు పొందు
దుఃఖ మెబ్భంగి నైనను దోలఁ గలవె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 46

గీ. ఆత్మ దేహమునం దుష్ట
పుణ్యపాపచయంబులు పొందు చుండుఁ
గాన నవ్వేళ నానందకరుఁడ వగుచు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు.

గీ. బ్రతికియుండుట దుఃఖంబు పడుటపాంటు
సౌఖ్యదుఃఖము లెవ్వఁడు సమ మటంచుఁ
దలఁచునో వాఁడు నిర్మలత్వము వహించు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 48

గీ. మరణమును శాశ్వతం బని మదిని నమ్మి
పరులు తనవారు ననియెడుభావ ముడిపి
సర్వజనసమ్మతంబుగా జరుగ వలయు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 49

గీ. మేఘమండలమున నుండుమెఱుపుభాతి
చిత్తమున సద్గుణంబులు చేరి యుండు,
వానిని బ్రకాశముగఁ జేయ వలయు నెప్డు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 50

గీ. తప్పుఁ జేసిననిను జూచి ధన్యుఁడ వని
మెచ్చి నీవారు నుతియింప మేటి వగుదె?
మనసునం దున్నమలినంబుఁ జెనకవలయు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 51

గీ. ఘనుఁడ వీ వని మెచ్చిన గౌరవంబు
గలిగె నని సంతసింపకు, మలిన మైన
చిత్తమందలిదోషంబు జెనక కుండ
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 52

గీ. దోషసంపర్క మైననీదుష్టబుద్ధి
పరుల వంచించి నడచిన బాగు పడదు
సజ్జనులమైత్రి నిరతంబు సలుప కున్న
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 53

గీ. పరుల వంచించుటయు నీకు ప్రాభవంబు;
తామసము దాల్చుటయు నీకు ధర్మనిరతి;
మాయలను బన్నుటయు నీకు మంచితనము;
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 54

గీ. ధర్మసంపత్తితో మది తనర వలయు;
నిశ్చలం బైనజ్ఞానంబు నేర్వ వలయు;
దుష్టమార్గంబులను వేగఁ దొలఁగ వలయు;
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 55

గీ. కామరాగాదిశత్రుసంఘంబు చేరి
జ్ఞానధనమును హరియించుఁ గాన, వేగ
ధర్మసత్యాదిమిత్రులదరికిఁ బొమ్ము
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 56

గీ. విద్య గలిగిన వినయంబు వెలయ వలయు;
వినయమునకును శాంతంబు గొనుట మేలు;
శాంత మబ్బిన సకలంబు సఫల మగును;
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 57

గీ. మలినచిత్తుని బ్రేమించు మత్సరంబు;
మత్సరంబును గ్రోధంబు మఱిఁగి యుండు;
క్రోధ ముండిననరునకు గుణము సున్న;
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 58

గీ. క్రమముగా నంతరింద్రియగణము నెల్ల
నణఁగఁ జేయుట మేలు మే లనిరి బుధులు
వారిబోధలు మునిజనవర్తనములు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 59

తే. కన్నవాఁడు, భయమునుండి * కాచినట్టి
వాఁడు, నన్నము పెట్టిన * వాఁడు, వడుగుఁ
జేసినట్టిఁడు, విద్యను * జెప్పినతఁడు
నరున కేవురుతండ్రులు * ధరణియందు. 96

క. ధరణిఁ గలయెల్లగ్రంథము
లరయంగఁ బరోపకార * మది పుణ్యముగం
బీరబడన మది పాపము
గ రహిం దెలియంగ నయ్యె * ఘనులకు నెప్పుడున్. 97

తే. చెనగు పెండ్లాము, నమ్మించి * చెఱచునట్టి
మిత్రుఁడును, నహంకారస * మ్మేళనమున
నెనఁగుభృత్యుఁడు, పా మున్న * యింటిలోని
వాసమును, మృత్యుతుల్యముల్ * పరిగణింప. 98

క. ఏదేశంబునఁ దనకున్
మోదము, గౌరవము, చుట్ట * ములు, ప్రీతియు వి
ద్యాధనము లుండవో, నరుఁ
డాదేశము వీడి పోవ * నగు నంతటితోన్. 99

క. తనగృహమునందు మూర్ఖుఁడు,
తనగ్రామమునందుఁ బ్రభువు, * తనదేశమునం
దున రాజు పొదలుచుందురు;
గనుఁగొన విద్వాంసుఁ డెల్ల * కడలం బొదలున్. 100

క. మలినముఁ గట్టినవానిన్,
బల్లుదోమనివానిఁ, గఱకు * బలుకులవానిన్,
బలుతిండిపోతు, సంధ్యలఁ
జెలువుగ నిదురించువాని * సిరి విడిచి చనున్. 101

తే. కత్తెఱను బోలు హృదయంబు * గలిగి, మంచి
గంధమును బోలఁ జల్లన * గలుగ మాట
లాడుచును నతివినయంబు * నభినయించు
నతని ధూర్తునిగా నర * యంగవలయు. 102

తే. భవ్యగుణములు గలభార్య, * బాలభాషి
తములు, రాజసన్మానము, * తగిన రీతి
నాదరించి పెట్టినభోజ * నాదికంబు
నమృతతుల్యము లని తెలి * యంగఁ దగును. 103

క. ఉపకారము చేసినయే
నపకారం బగును నీచు * లం, దెపుడు సరీ
సృపములకుఁ బాలు వోసిన
విపరీతము గాఁగ ఘోర * విష మగుఁ గాదే. 104

తే. భూప్రదక్షిణ మొనరింపఁ * బొసఁగుఫలము,
కాశియాత్ర యొనర్పంగఁ * గలుగుఫలము,
సేతువునఁ దాన మాడినఁ * జెందుఫలము
మాతృవందన మొనరించు * మాత్రఁ గలుగు. 105

క. కరుణయు, సిగ్గును, భయమున్,
వరలోకజ్ఞతయు, ధర్మ * వర్తన మివి యే
నరునకు లేకుండునొ, వాఁ
డరయన్ మైత్రికి ననర్హుఁ * డని తెలియఁ దగున్. 106

తే. బాలకులతోడి మైత్రియు, * స్త్రీలతో వి
వాదమును, దుష్టసేవయు, * వట్టిగప్ప,
సంస్కృతము గానివాణి, రా * సభగమనము
జనులకున్ లాఘవముఁ గూర్చు * జగతియందు. 107

క. కవియే కవితాశ్రమ మె
ట్లవు నని తెలియంగఁ గలుగు * నన్యున కవునే?
భువి గొడ్రాల్ ఘన మైనప్రి
సవవేదన తెలియఁ గలదె * స్వాంతమునందుకా? 108

తే. తల్లి తిట్టును, దండ్రియు * నొల్లకుండు,
భార్య చూడదు, భృత్యుఁడు, * పలుకఁ, డాలుఁ
దలఁప, దనుఁగులు సరిరారు * ధనము లేని
వానిఁ, గాన ధనముఁ గూర్ప * వలయు జనుఁడు. 109

తే. పాలు గోమూత్రలేశము * పడినఁ జెడును,
జెడదు తక్ర మయ్యది చాల * పడినఁ గాని,
శుచికిఁ బాపలేశమె కీడు * చులకఁ జేయుఁ
బాపికిం బాపశత మైన * భయము లేదు. 110

క. మున్నీరు దచ్చునప్పుడు
వెన్నుని లక్ష్మియును, శివుని * విషముం బొందెన్;
ఎన్నఁగ నదృష్ట మొక్కం
డున్నం, బౌరుషము విద్య * యును బని యగునే? 111

తే. ఆశ వైతరణీనది * యట్టి దగును,
గోప మంతకుఁ డట్టి దై * కుతిలఁ గుడుపుఁ,
గామధేనువ యై విద్య * కాంక్షఁ జేయు,
సంతసము నందనం బయి * సౌఖ్య మిచ్చు. 112

క. అస్థిరము బ్రదుకు, యౌవన;
మస్థిరములు ధనము గోలె * నన్నియు నెన్నన్
సుస్థిరము ధర్మమార్గము,
సుస్థిరము యశం బటంచుఁ * జూడఁగవలయున్. 113

క. చితియుం జింతయు రెండే
క్షితిఁ గల, వట ఘనము చింత * చితికన్నఁ గనన్;
చితి మృతునిఁ గాల్చిపుచ్చును,
బ్రతికినజనుఁ గాల్చుఁ జింత * పరికింపంగన్. 114

తే. వైరినిన్, వైరిమిత్రుని, * వానిమిత్రు,
ధర్మహీనునిఁ, దస్కరు, * దాసజనుని,
వ్యభిచరించెడువానిని, బరవనితను,
నాశ్రయింపఁగ రా దెట్టి * యవసరమున. 115

తే. ప్రియము, సత్యముఁ జెప్పవ * లయును, సత్య
మనుచు నప్రియమును జెప్ప * నయితి గాదు,
ప్రియ మనుచు ననృతము నాడ * నయితి గాద;
యిది సనాతనధర్మ మం * చెఱుఁగ వలయు. 116

ఆ. శ్రద్ధ గలిగి విద్య * సంతరింపఁగ వచ్చు
హీనజాతు నొద్ద * నైనఁ గాని,
ధర్మ మెఱుఁగ వచ్చుఁ * గర్మచండాలుని
యొద్ద నైనఁ గాని * బుద్ధి మీఱ. 117

తే. ఘనవిషమునుండి యమృతంబుఁ * గొనఁగ వచ్చు,
బాలునుండియు సూక్తినిఁ * బడయవచ్చు,
పరులనుండియు సద్వృత్త * మరయవచ్చు,
నశుచినుండియు బంగరు * వండవచ్చు. 118

తే. పరవశం బగు నంతయు * నరయ దుఃఖ,
మాత్మ వశ మగు నంతయు * నరయ సుఖము,
తెలియ సుఖదుఃఖముల కిదే * లలితలక్ష
ణం బటంచును ధర్మశా*స్త్రంబు పలుకు. 119

## పదునొకండవ ప్రకరణము.

—:(O):—

సౌభాగ్యవతి యాకాలపుసౌందర్యవతులలో సౌందర్యవతి యై, ఆ స్త్రీశస్త్రవిద్యానైపుణిచే మెఱయుశౌర్యగాంభీర్య యని విఖ్యాతి గాంచి యుండె. సౌభాగ్యవతి యనుశాస్త్రశుభాక్షరపంక్తి సహజనామధేయముగాఁ గలభామినీమణి యోగ్యగుణశీల యని వేఱ చెప్ప నేల? ఆమెయోగ్యగుణములు జగద్విశ్రుతములు. పవిత్రచరిత్రము శతపత్రనేత్రలకుఁ బఠనపాత్రంబు. భూతదయచేఁ బరిశుద్ధ మైనయంతఃకరణము, సత్యముచేఁ బవిత్ర మైనమృదుమధురవాక్సరణి, నిష్కళంక మైనపాతివ్రత్యము, నిశ్చల మైన యీశ్వరభక్తి, స్వలాభముఁ గోరనిపరోపకారచింతనము, డంబము లేనిసమర్థత, ఉపేక్ష లేనిశాంతము, తుళ్ళు లేనిప్రసన్నము, కర్కశత్వము లేనిశౌర్యము, యశస్కామము లేనివితరణము, అనుభూత మైన సర్వశాస్త్రపరిజ్ఞానము, శౌచము, స్వాభావికభూషణము లై తనయసమానసౌందర్యమును వెలయింపఁ జేయ నించుకేని గర్వింపఁబోనియాసాధ్వీలలామకు నింకొకరికి నుపమానము సేయుటకంటె నవివేకము వేఱు కలదా? కావున నామెకు సాటి యామెయే యనుట మిక్కిలి సమంజసము. ఆసతీమతల్లి కనోజూరా జగు చందనునకుఁ బట్టపుదేవి. వివాహము సేయఁబడి కాపురమునకుఁ బంపఁబడునప్పటి కామెకుఁ బదునెనిమిదిసంవత్సరములకంటె నెక్కువవయస్సు లేదు. కాపురమునకు వెళ్లినసంవత్సరమునందే యామె కొక్కచక్కని చుక్కవంటిపుత్రిక జనించెను. తరువాతఁ జాలకాలమువఱకు గర్భప్రాప్తి లేకపోయెను. అందుచే నామెభర్త మరలఁ బుష్పవతి యనుకన్యకను భార్యగ స్వీకరించి యుభయులను నేలుచుండెను. ఒకయొఱలో రెండుకత్తు లెన్నఁడైన నిముడునా?

పుష్పవతి విద్యయందేని, శౌర్యమునందేని, రూపమునందేని, సౌభాగ్యవతికి సమతు కాకపోయినను, సవతి కావున నామెకంటె నెక్కువదాన నని యనిపించుకొనుటకు విలువైనవింతదుస్తులు, నానావిధాలంకారములు ధరించుచు, నొకప్పుడొకవేషము నింకొకప్పుడు మఱియొకవేషము దాల్చుచు, నంగిలినుండి మాత్రము వెలువడు నమ్మృతభాషల వన్నెచిన్నె లెన్నియో చూపుచుండెను. ఇంచుక రోషావేశము గల్గె నేని భర్తసైత మామెకడ గడగడలాడుచుండ నింకఁ దక్కినవారిలెక్క యేమిటి? వేయేల? ప్రాసాదాంతరమున నున్నదాసదాసీజను లందఱు నామెనుగూర్చి ముచ్చటించునప్పుడు "గయ్యాళిగంప" యనియు, సౌభాగ్యవతిని "అమ్మగారు" అనియుఁ జెప్పుకొనుచుండిరి.

ఇంక భర్తృవశీకరణసామర్థ్యంబున సత్యభామయు నామెకు సమానము గా దనవచ్చును. ఏ మైనను ముందు వచ్చినచెవులకన్న వెనుక వచ్చినకొమ్ములు వాడి కాక మానునా? చందనుఁడు సౌభాగ్యవతికంటెఁ బుష్పావతినే యెక్కుడుగఁ బ్రేమించెడివాఁడు. కావున నామెజెండా ప్రస్తుత మెగురుచున్నది. రాజామె యుమ్మి వేసి దాటవద్దన్న దాటకుండనిచో, నింక నెల్లవారలకు నామె యిడునదే భిక్షము గాక వేఱే మున్నది? ఆమెయధికారములో రాచనగరు నాశ్రయించుకొన్న బ్రాహ్మణులు చాలమంది తోటకూరకట్టకైన గతి గానక యాయూరును విడచి చనిరి. సౌభాగ్యవతిని దూషించుచు దనను గూర్చి స్తోత్రపాఠము చేయునపాత్రులకు మాత్రము కొంతజీవనాధార మప్పుడఁ గలిగియుండెను. అటువంటినటన లెఱింగినకుటిలాలక గుండెపైఁ గుంపటివలె సవతియై యుండ, సౌభాగ్యవతికి సంసారమునం దిఁకఁ బోరాటములకు లోటే మున్నది? సవతిపోరని పెద్దలు చెప్పుదురు గదా! సౌభాగ్యవతిని గూర్చి యొరులతోఁ బ్రసంగించునెడ పుష్పావతి మాటయందైనను గౌరవము జూపునది కాదు.

సౌభాగ్యవతి తనసవతియొక్క యహంభావమును వినోదముతోఁ జూచుచు జాలి వహించునది యే కాని యీర్ష్య యెంతమాత్రము గలిగినది కాదు. అప్పటికి సౌభాగ్యవతీతనూజ సుమారు పదిసంవత్సరములువయసుది. కావున సవతితల్లి యంతిపురమున కెడపదడపఁ బోవుచు వచ్చుచుండి "మీయమ్మ నింటనుండి వెడలఁగొట్టించుదు నని పిన్ని యెన్నెన్నియో దుర్భాషల నాకడ దూషించినది" యని చెప్పుచుండ, సౌభాగ్యవతి "అమ్మాయీ! వేడినీరుచే నిల్లు గాలునా? మనకు విచార మెందుకు? ఓర్చినవసరమునకుఁ దేటనీరన్న సామెత యెఱుంగవే!" యని యోదార్చుచుండెను.

రానురాను సౌభాగ్యవతిపైఁ బ్రబలద్వేషము జనింపఁ బుష్పావతి యామెను జంపించి తానే పట్టమహిషి గాఁ గోరి యెన్నెన్నియో పన్నుగడలు పన్నుచు సౌభాగ్యవతిపై లేనిపోనియపనిందలు మోపి భర్తకు నివేదించుచుండె. చందనుఁడు సౌభాగ్యవతియొక్క ప్రవర్తనము స్వానుభవముచే నెఱింగినవాఁడగుటచే నామెపైఁ బడినయపనిందను నమ్మక ప్రియురాలు చెప్పుచున్నసంగతి గనుక నమ్మియు డోలాయమానమానసుండై యుండె. అంత నొక్కయర్ధరాత్రంబున సౌభాగ్యవతి నిశ్చింతతోఁ దనయంతిపురమున నిద్రించుచుండఁగాఁ బుష్పావతి భర్తతో "నామాటలు నమ్మక త్రోసివేసినారు కదా? ఇప్పుడు మీపట్టపుఁదేవియొక్క యంతఃపురమును శోధింపుడు. సర్వము మీకే బోధపడు" నని చెప్పెను. అందుపై రాజు వింత యేమిటో చూచెదఁ గాక యని యాత్రముతో సౌభాగ్యవతిరాణివాసంబున కేగి "సౌభాగ్యం! సౌభాగ్యం! తలుపు తెఱువు" మని కవాటము తట్టెను. నిద్రించుచున్నసౌభాగ్యవతి కాపిలుపు స్వప్నములాగునఁ దోపఁ గొంతవఱకు నిదానించి మరలఁ బిలుపు వినఁబడఁగానే

ప్రాణనాథునిగ గుర్తించి వడిగఁ దలుపు తెఱచెను. రా జింకను ద్వారమునకు వెలుపలనే నిలువఁబడి యుండె. సౌభాగ్యవతి నిద్దురబద్ధకముచేఁ గన్నులు నిమురుకొనుచు లోపలిగడపయందే వసించియుండెను. అంత లోననుండి యొకయౌవన పురుషుఁడు చటాలున నాదంపతులనడుమనుండి బయటికి దాటి పాఱిపోయెను. సౌభాగ్యవతీచందను లాశ్చర్యముతో నిశ్చేష్టులై నిల్చిరి. పుష్పవతి చెప్పినవిషయమునకుఁ బ్రత్యక్షప్రమాణము గలిగినది కావునఁ జందనుఁడు పట్టరానిరోషావేశంబునఁ దక్షణమె యచ్చోటునుండి మరలెను.

సౌభాగ్యవతి యాయుత్పాతమునకుఁ దలఁకి మేనఁ బ్రాణంబులు లేనిదానివలె నేలఁ గూలెను. తెలువాఱఁ దెల్లవాఱువఱకు నేమి జరగెనో యామెకుఁ దెలియదు. అంతటఁ దెల్లవాఱినది. సూర్యోదయమున కింకొకగంటకాలము వ్యవధి కలదు. కోట లోనిసంగతి పైకి దాటలేదు. చందనునికోపానలంబు పుష్పవతీకుప్రవచనేంధనములచే మఱింత రవులుకొని భగభగ మండుచుండె. అయ్యెడఁ జందనుఁడు పుష్పవతియొక్క రాణివాసమున నుండి సౌభాగ్యవతి నటకు రావించి "నీయపవిత్రగాత్రంబును గంగలో గలిపి ప్రాణముఁ ద్యజింపు" మని యానతిచ్చె. సౌభాగ్యవతి యట్టిసంసారమున బ్రతికియున్న లాభ మే మని భర్తృనాజ్ఞకు సంతసించి "అంతటిధన్యురాల నగుదునా యనియె యోజించుచుంటి" నని ప్రత్యుత్తరం మిచ్చి సంసిద్ధ యై నిల్చె.

తదుపరి, రహస్య మెవ్వ రెఱుంగకుండఁ జందనుఁడు సౌభాగ్యవతిని గంగానదికిఁ దోడ్కొనిపోయి, యొకనావలోఁ గూర్చుండఁబెట్టి నట్టేటిలోనికి నావ సాగినతఱువాత లోన కుఱుకు మని యాజ్ఞ చేసె. ఆపరమసాధ్వి తనవియోగమును బుత్రిక కైన నెఱింగింపలేదు. పుత్రికను నోదార్పు మని భర్తను వేఁడికొనుట కైన నామె కవకాశము గల్గలేదు. కాని "గంగాభవానీ! నీలోఁ గలియుచున్నదానను. న్యాయమును స్థిరపఱుపు" మని మాత్రము గంగను బ్రార్థించి కబరీభారముచేఁ గన్నులు గప్పికొని, హరహరా! యని సభాలున గంగాగర్భమున దుమికెను. అప్పుడు గంగానది, యట్టిపరమపతివ్రతా శిరోమణి తనతోఁ గూడవచ్చిన దని యుప్పొంగినరీతి తరంగములచే మిన్నుముట్టుచుండె. చందనునికోపానలం బప్పటికిఁ జల్లార నింటికి మరలెను. పుష్పవతి యంతర్ద్వేష మంతయు నంతఁ జల్లార సంతుష్ట యయ్యె.

ఆసమాచారము పురజనులు విని పుష్పవతిని దూషించుచు నేటితోఁ గనోజ భాగ్యలక్ష్మి తరలిపోయె నని యొక్కపెట్టున గోలున నేడ్చుచు గంగకుఁ జని యాబాల గోపాల మపస్నాతులై సౌభాగ్యవతికి ముక్తి గలుగుగాక! యని యీశ్వరుని ధ్యానించిరి. నాటితోఁ గనోజ రాచనగరు దీపకళిక లేనిహీనగృహమట్లు శోభను బాసియుండె.

## పంచదశ ప్రకరణము

—(0)—

తనరాయబారమునకు లోఁబడలే దని కనోజురాజగుచందనునిపైని, తాను గామించినసుందరాంగిని బెంగ్లాడఁ వలఁచినచిత్తూరురాణా యగువిక్రమాజితునిపైని, చిత్తూరుకనోజులపై దాడిపెట్టుటకు సమ్మతింపనందుకు ఢిల్లీశ్వరుఁ డగుహుమయూనునిపైని, గలిగినయీర్ష్యాతిశయము తేరితాగ్నులవలెఁ దన్ను బాధింప, అజాఫ్ ఖానుఁడు ఘూర్జరప్రభు వగు బహదూర్ షహా నాశ్రయించి తనయీప్సితములు నెఱవేర్చుకొన సమకట్టి యొకనాఁ డాతనికడకుఁ బోయెను.

సుల్తాను అజాఫ్ ఖానునిపై నీర్ష్య వహించినవాఁ డయ్యు, నాతఁడు తనకు వ్రాసియుండినయొకసౌహార్దసూచకమైనలేఖం జూచి, కొంతవిశ్వాసము గలిగి దర్శన మిచ్చి మాట్లాడెను. అయ్యెడ వారల కీరీతిఁ బ్రసంగము జరగెను.

బహదుర్షహా— నిరుడు హుమయూనునితోఁ గూడి నాపైకి యుద్ధమునకు వచ్చియున్నను, నీవు వ్రాసినయుత్తరమువలన మిత్రుఁడ వని నిన్ను భావించుకొంటిని

అజాఫ్ ఖాను— అట్లే భావింపుఁడు. మీయెడ నా కెన్నఁడు భేదబుద్ధి లేదు. అప్పు డేను జక్రవర్తిసైన్యమునందుఁ గొలువునకుఁ గుదురుకొనియుండుటవలన నాతని గూడి మీపైకి రావలసివచ్చెను. నేను సాహాయ్యము చేయుటవలననే చక్రవర్తి మిమ్ము గెలువఁ గలిగినవాఁడు. నే నాతనికిఁ బెక్కుయుద్ధములలో సాయము చేసి గెల్పించితిని. అట్టివిషయములో నాయం దాతనికి గౌరవము లేనట్టు తోఁచి, నే నిప్పు డాతనికి దోడ్పడుట మానివేసినాను. ఆతఁడు తిరిగి యీనడుమ మీరాజ్యముపైఁ గన్నువేసి నన్ను యుద్ధము నడుపు మనెను. అందుకు నేను సమ్మతింపలేదు. అందుచే నాపై నిప్పుడు కార్పణ్యము వహించినవాఁడు.

షహా— హుమయూనునకు నీ వొనర్చినమేలు నే నెఱుంగుదును. న్యాయ మాలోచింప, నాతఁడు నీయెడ నెంత కృతజ్ఞుఁడు గావలసియుండును? నీవంటివాఁడు నాకడ నున్న నెత్తి మీఁదఁ బెట్టుకొనువాఁడను.

ఖాను—నేను నప్పే భావించుచుంటిని. నిజముగా హుమాయూను నాకలన బాగు పడినాఁడు. నే నాతనికిఁ జేసినయుపకారము నింకొక్కరి కొనర్చిన నాకుఁ గలుగు గౌరవమునకు మేర యుండునా? ఆత్మగౌరవము లేనిపదవి యున్న లాభ మేమి? హుమయూనునకు లౌకికవ్యవహారధర్మములు తెలియవు. ఢిల్లీసామ్రాజ్య మాతని కెంత మాత్రముఁ దగియుండలేదు. మీబోంట్లకు ఢిల్లీరాజ్యాధిపత్య ముండిన బాగుగ నుండు నని నేఁ దలంచెద. మీరందుకుఁ బ్రయత్నించిన నాకుఁ జాల సంతోషముగ నుండును.

మహా—అట్టిరాజ్యజిగీష గలిగినఁ గార్య మేమి? ఇప్పటిరాజ్యములలో నెల్ల ఢిల్లీ బలవత్తర మైనది. అట్టిదాని నాసించుట యందనిఫలముల కఱ్ఱులు సాచుట కాదా!

ఖాను—అట్లు తలంపవలదు. హుమయూనుఁడు నామమాత్రమునఁ జక్రవర్తి. నే నాతనికిఁ దోడ్పడనిచో యుద్ధము చేయుసాహస మాతని కెక్కడిది? మీకు నాయందు విశ్వాసము గల దేని, మీకు సాయము చేసి మూఁడుగడియలలో మిమ్ము ఢిల్లీసింహాసనమందు నిల్పెదను. మీతో నేను గలసియున్న హిందూదేశ మంతయు మనచేతిలో నుండదా? ఢిల్లీని గెల్చుకొన్నపై సకలరాజ్యములు మనకే లోఁబడును. కావున నుపేక్ష లేక మీ రందుకై త్వరపడుడు.

మహా—నీ వెంత సాహాయ్యము చేయుచున్నను మనము తలఁచునది పెద్దయెత్తు బడి కావునఁ దగినంతబలము చూచికొని సిద్ధపడవలెను గాని యింతలోఁ దొందరపడరాదు. నిడివిమీఁదఁ బని చేయవలెను.

ఖాను—దానికై యింతయాలోచన మెందుకు? ఢిల్లీయొక్కగుట్టంతయు నాకుఁ దెలియును. నేను వారినుండి విడిపడి మీలోఁ జేరితిని. ముఘలసైన్యము మీసైన్యమును మించునది కాదు. నాచేతిలోఁ గూడ పెక్కండ్రు గలరు. నావద్ద నున్న రహిమాన్ అబ్దుల్ ఖాను లిర్వురలో నొక్కొక్కరుఁడును నొక్కొక్కరాజ్యమునకుఁ జాలినవారు. పైఁగా ఘుర్ మండలాధీశుఁడు నాకు స్నేహితుఁ డగుటవలన నాతఁడును మనకే సాహాయ్యము చేయ నున్నాఁడు. అయిన నిం దొకరహస్యము కలదు. ఢిల్లీశ్వరునకుఁ గుడి యెడమలఁ జిత్తూరుకనోజులు సాయము చేయు నని యొకశంక మాత్రము గలదు. కావున మనము ముందుగాఁ జిత్తూరుకనోజులప్రతాపదీపంబు లార్పవలెను. అప్పుడు ఢిల్లీ తనంతఁ దానే మనకు స్వాధీన మగును. ఇప్పటిచిత్తూరురాణా సమర్థుఁడు గాఁడు. మనము చిత్తూరుపై కరిగినవెంటనే మనకు జయము తప్పదు. చిత్తూరు జయించినతోడనే వేడి చల్లారకుండ నే నొక్కఁడ గొంతసేనతోఁ బోయి కనోజున మనజెండా నాటెదను.

నవా.—ఇంతధైర్యము నీ కున్నయెడల, నింకఁ గొదువ యేమిటి? చిత్తూరును జయించితిమ యేని, ఢిల్లీపై యుద్ధము మన కొకక్రీడవంటిది కాదా? చిత్తూరు మనకు స్వాధీన మైనచో, ని న్నచ్చట ప్రభువుగాఁ జేయుదును.

ఖాను—చిత్తూరునకు నన్నే ప్రభువుగాఁ జేసినయెడల మిమ్ము గడియలో డిల్లీ చక్రవర్తిగాఁ జేయకుందునా? నాసామర్థ్యమును మీరే యప్పుడు మెచ్చుకొనరా?

అని యజాఫ్‌ఖానుఁడు నమ్మకము దోఁపఁ బలికినపలుకుల కలరి బహదుర్షహా వెంటనే యుద్ధసన్నద్ధుఁడై తొలుతఁ జిత్తూరుపైకిఁ దనఫౌజులు నడపించెను.

# పదుమూఁడవప్రకరణము.

చందనుఁడు సౌభాగ్యవతిని గంగాప్రవేశము చేయించి స్నానమాడి యింటికి వచ్చుచుండఁగా గ్రామరక్షకభటు లొకయపరాధిని సంకెలలతో బంధించి రాజాస్థానమునకుఁ దీసికొనిపోవుచుండిరి. రా జాయూరికావలులను జూచి యీవిషయ మే మని ప్రశ్నింప, వారు రాజునకు మ్రొక్కి మహాప్రభూ! “ఈతఁ డొకయపరాధి. కడచిన రాత్రి మేము వీధులందు గస్తీ తిరుగుచుండఁగా నర్ధరాత్రమున నగరులోనుండి బయటికి వచ్చి పాఱిపోవుచుండ మేము వెంబడించి వీనిని బట్టుకొని బంధించితిమి. ఇప్పుడు విచారణమునకై తమసాన్నిధ్యమునకుఁ దీసికొనివచ్చుచుంటిమి” అని చెప్పిరి. “ఆరాత్రి సౌభాగ్యవతియంతఃపురమునుండి తప్పించుకొని పాఱిపోయినపురుషాధముఁడు వీఁడే” యని రాజు భావించి “ఓరీ! నీ వెవ్వఁడవు” అని యడుగ, వాఁడు ప్రత్యుత్తరము చెప్పక వెఱ్ఱిచూపులు చూచుచు గుటకలు మ్రింగుచుండెను. రాజు మరలమరల నడిగెను గాని, వాఁడు మాటాడనే లేదు. అంతటఁ జందనుఁడు కుపితుఁడై ఖడ్గముతో వానిశిరస్సు ద్రుంప సిద్ధపడఁగా, భయ మంది “స్వామీ! నే నేద్రోహమును జేయ లేదు. నేను బురుషుఁడను గాను. పుష్పవతీదేవిమాటలు విని మోసపోతిని. నేను మీ సేవకురాలను మాయావతిని. నన్ను క్షమింపుఁడు.” అని యాకృత్రిమపురుషుఁడు వేఁడికొనెను. అంతఁ జందనుఁడు నిశ్చేష్టుఁడై, తనను మోసము చేసినపుష్పవతీకృత్రిమప్రవర్తనమున కెంతయు జింతించి, సౌభాగ్యవతియెడఁ దా నొనర్చినమహాపరాధమునకుఁ బశ్చాత్తాపము నొంద సాగెను. మరల రాజు మాయావతినుండి సంగతి సాంగంబుగ దెలియఁగోరి, “యింతకపటవేష మేల పన్నినదానవు?” అని యడుగ నామాయదారి “అయ్యా! పుష్పవతీదేవికి నేను బ్రియమైనచేటికను. ఆమె యెంతటి రహస్య మయ్యును నాతోఁ జెప్పక మానునది కాదు. ఆమెకు సౌభాగ్యవతీదేవిపై నీర్ష్య వొడమ, నామెను జంపింపఁ దలఁచి నాతో నాలోచనము సేయుచు, “నన్నుఁ బురుషవేషముతోఁ బట్టపుదేవిగారియంతఃపురమున నిన్నరాత్రి వసింపు మనెను. నే నామెహితంబును సేయఁగోరి యీదుష్కృత్యమునకుఁ బూనినదానను.” అని విన్నవించెను.

"నీవు సౌభాగ్యవతియంతఃపురంబున నెట్లు వసింపఁ గలిగితివి?" అని రాజు మరలఁ బ్రశ్నింప "స్వామీ! ఏమని విన్నవింతును? యీ యకృత్యము జరగించుటకు ముందు పదిదినములకిందట నేను సౌభాగ్యవతీ దేవిగారివద్దకు బోయి కపటవాక్యములతో "అమ్మా! పుష్పావతికి నాయందుఁ గోపము వచ్చినది. నే నామెపరిచర్యను వదలివేసినాను. నే నింక నా కామెకడ నూడిగము సేయుదానను గాను. మిమ్ముఁ గని పెట్టుకొనియుందును. నన్నాదరింపుఁడీ" యని వేఁడికొన, పాప మాయిల్లాలు నన్నుఁ బ్రేమతో నాదరించి యెంతయో నాయెడ విశ్వాసము గల్గి పరుండునప్పుడు సైతము నన్ను దగ్గఱ నుంచుకొనుచుండెను. నేను పుష్పావతిదుర్బోధనలకు లోనై చిన్నరాత్రి యీకృతఘ్నతాసూచకమైనయకృత్యమును జేసినదానను. నన్నుఁ జంపినను సరే, క్షమించినను సరే" యని మాయావతి బదులు చెప్పెను. అంత రాజు దోష మంతయుఁ బుష్పావతియందు మోపి, మొదటితప్పిదము గావున నా దాసిని నడివీధిలో ముక్కోణమునకుఁ గట్టించి కొఱడాతోఁ దుంట్లపై గట్టిగా నూఱుదెబ్బలు కొట్టించి విడిచిపెట్టెను.

రాజ్యలక్ష్మి యగు సౌభాగ్యవతిని నిష్కారణముగాఁ జంపినతనయవివేకమునకు మరలమరల శోకతప్తుఁడై, తనకడలేనిదుఃఖభారమునకు హేతువైన పుష్పావతిపై నాపరానికోపము జనింపఁ జందనుఁడు నడివీధి కామె నీడ్చుకొనిపోయి బొండ వేయించి పదిదినములు తిండి పెట్టక యుండఁగట్టెను. పౌరజనులు సౌభాగ్యవతి గంగాప్రవేశమైనసంగతి విని యెంత దుఃఖించిరో, యంత యానంద మయ్యెడఁ బొందిరి. అంతతో బుష్పావతిమిడిసిపా టడుగంటెను. చందనుఁ డామెమోము నైనఁ జూడ వాంఛింపక చేతులారఁ జేసినమహాపాతకమునకుఁ బ్రాయశ్చిత్తముగా నొంటిపూట భుజించియు, నేల శయనించియు, నీశ్వరుని భజించుచుఁ గాలము గడపుచుండెను.

# భవిష్యద్గ్రహస్థుడు.

## ౧ వ అధ్యాయము.

దక్షిణాపథమునందుఁ బూర్వసముద్రతీరమున నుత్తరాభిముఖమై పోవుచున్న రైలుబండియొక్క యొకపెట్టెలో నొక్కఁడే బాటసారి పరుండియుండెను. వైశాఖ మాసము కావునఁ బ్రాతఃకాలమందుఁ బొమ్మ్మదిగంటలకే యెండవేడిమి యెక్కువగా నుండుటంజేసి యాతఁడు బండిగవాక్షముల మూసెను. ఏకాంతమున నున్నప్పుడు సాధారణముగా మానవులచిత్తంబు లెద్దియో విషయధ్యానంబునందు లగ్నంబు లగుట స్వాభావికమై యుండ సప్రసవజిజ్ఞాసువును, నిరువదవశతాబ్దియందలి జ్ఞానగంధము నాఘ్రాణించినవాఁడును, దేశసేవయందాసక్తి కలవాఁడునైనసీతాకాంతముయొక్క బుద్ధిసాంఘికాచారమననమునందో, భాషాభ్యుదయవిచారమునందో, దేశోద్ధరణప్రయత్న చర్చయందో, పరబ్రహ్మోపాసనాన్వేషణమునందో, పరిభ్రమించుచుండెనని యనుకొనకుండు టెట్లు? అతఁడు పరుండియున్నను గన్నులు మూసికొనిలేదు. ప్రక్కన నున్న పుస్తక మెత్తుకొనుచుండుటచే దానిని బరుపుచుట్టక్రిందికి నెట్టెను. రైలుబండిచప్పుడు నిరంతరము కర్ణగోచరమగుచు వినఁబడియు వినఁబడనిదిగా నుండినందున రైలు కదలుచు న్నప్పటికంటె నాగినప్పుడే యతనిమనస్సునకుఁ గొంచెముచలనము కలుగుచుండెడిది. బండి యాగినప్పు డెల్ల దిగెడువారు నెక్కెడువారు గుబగుబలాడుచుండిరి కాని యతని బండికిఁ దాళము వేసియున్నందునను గ్రొత్తగా రంగు వేసియున్నందునను దానిదగ్గఱ కెవ్వరును రారైరి. అయినను సీతాకాంతముయొక్క యైకాంత్యమునకుఁ ద్వరలోనే యంతరాయము సంభవించినది. బండి యొకచిన్నమజిలీయొద్ద నిలిచి వెంటనే కదలఁ బోవుచుండెను. ఒకఁడు తాళము తీయఁగా ముగ్గురుపురుషులు నొకయువతియు సంభ్రమమున నెక్కిరి. సీతాకాంతము లేచి కూర్చుండెను. వారిలో నొక్కఁడు సీతాకాంతముపార్శ్వమునను, వేఱొకఁడు మఱియొకబల్లమీఁదను గూర్చుండిరి. ఇంకొకఁడు యౌవనుఁడు. అతఁ డొకబల్లమీఁదఁ జిఱుచాప వేసి మెత్తనిగుడ్డలు పఱచి దిండు తలగడ యుంచెను. అతఁడు యువతి నాపాన్పుపైఁ గూర్చుండఁబెట్టి తా నింకొక

బల్లమీఁదఁ బా నృమర్చికొని యాసీనుఁ డయ్యెను. బండిలో నెక్కినప్పుడు యౌవనుని చేతియం దొకఫిడే లుండెను. యువతిచేతియందుఁ బూచికపుల్లలకట్ట యుండెను. అందఱు ముఖములఁ దిలకము లున్నవి. ఆపె కూర్చుండినబల్ల సీతాకాంతమున కెదురుగ నుండెను.

## ౨ వ అధ్యాయము.

మౌనముద్రియందో, యనిమేషత్వమునందో, యస్ఫుటఘాలవళియందో, భ్రూసంకోచమునందో, ఐచోవిలంబనమునందో, బయటికిఁ గన్పట్టుమనోవికారము సీతాకాంతముముఖమున నగపడుచుండెను గాని ప్రయాణసంభ్రమమున నున్న వారు దానినిఁ గనుఁగొనలేదు. అతనిపార్శ్వమున నున్నయాతఁడు తక్కినవారిలో నొకనిని "ఎంగె పోరె" అని యరవములో నడిగెను. సికిందాబాదున కని యాతఁడు బదులు చెప్పెను. మఱియేమొ మాటలాడిరి కాని సీతాకాంతమునకు వారిసంభాషణ మంతయుఁ దెలిసినదికాదు. యౌవనుఁడును, యువతియు, సికిందాబాదున కని ప్రత్యుత్తరము చెప్పినమూఁడవయాతఁడును, గలిసి ప్రయాణము చేయుచున్నా రని మాత్రము గ్రహించెను. నాలవవాఁడు సీతాకాంతమును జూచి "మీ రెక్కడకుఁ బోవుచున్నా రని యింగ్లీషులోఁ బ్రశ్నించెను. నేను——— కుఁ బోవుచున్నా నని యాతఁడు తెలుగులోనే బదులు చెప్పి మీ రెచ్చటికిఁ బోవుచున్నా రని తెలుఁగులో నడిగెను. "నాకుఁ దెలుఁగు రాదు. టమిల్‌లోఁ గాని యింగ్లీషులోఁ గాని చెప్పుడు" అని యాయన యింగ్లీషున ననెను. సీతాకాంత మింగ్లీషుననే యతనితో సంభాషింప మొదలిడెను. యువతియు యౌవనుఁడు నేమియో గిన్నెలోనుండి తీసికొని భుజించుచు నవ్వుకొనుచు మూఁడవయాతనికి వినయముతోఁ గొంత పెట్టుచుండిరి. పైమజిలీలో నాలవయాతఁడు దిగి సీతాకాంతముకరమునఁ గరము గీలించి "పోవుచున్నాను సెలవు" అని చెప్పి చనెను. మూఁడవయాతఁ డప్పుడప్పుడు సీతాకాంతమువంకఁ జూచుచుండెను.

## ౩ వ అధ్యాయము.

మధ్యాహ్న మైనది. బండి యతిశీఘ్రగమనంబునఁ బోవుచుండెను. పట్టాల కిరుపార్శ్వముల నున్నయీతమట్టిదిబ్బలనీడలు సూర్యాతపతైక్ష్ణ్యమునకు వెఱచియో యన, సంకుచితము లై యుండెను. మజిలీమజిలీయొద్ద మజ్జిగ, మజ్జిగ, మూర్, మూర్, నుంగా యని ముంతలు, కుండలు, బుట్టలు, పట్టుకొని యమ్ముచుండిరి. పిపాసార్తు లైనయాత్రికులు దిగి త్వరత్వరగ జలయంత్రమునొద్దఁ బానపాత్రలు నింపుకొని తమ పెట్టె కనుఁగొనలేక

సంభ్రమపడుచు నటునిటు తిరుగుచు బండిలో నెక్కుచుండిరి. సీతాకాంత మింతవఱ కెన్నఁడును నీటికొఱకు దిగలేదు. ఒకమజిలీయొద్ద యౌవనుడు జలమును దెచ్చి యీయా యువతి మక్కువతోఁ ద్రావెను. పిమ్మట మూఁడవయాతఁడును యౌవనుఁడును ద్రావిరి. ఇంతలో నొకఁ డిత్తడిపాత్రములు, గోతములు, మూటలు వేసికొని వీ రున్నపెట్టెలో నెక్కఁ బోవ యౌవనుఁ డింగ్లీషులో గంభీరముగ నఱచి యతని నదలించెను. "నీగోతములు, పాత్రలు సామానులబండిలో వేసి నీవు వచ్చి కూర్చుండుము. ఇవి యన్ని నీ విచ్చటఁ బెట్టుటకు వీలు లేదు" అని మూఁడవయాతఁడు చెప్పెను. వాఁడు బండి పోవు ననుతొందఱచే వీరితో వాదింపక నెట్టుకొని మఱియొకపెట్టెలో నెక్కెను. "మూషుఁడు. మన మీయుక్కకే యాగలేక యుండఁగా నీమోటువాఁడు గోతాలు తెచ్చి మనమీఁద వైవ వచ్చినాఁడు." అని మూఁడవయాతఁడు సీతాకాంతముతో ననెను. సీతాకాంతము బదులుమాట చెప్పలేదు. ఊఁగొట్టెను. యౌవనుఁడు యువతితో నేమియో వచించుచుండ, నాపె యతఁడు ధరించినపంట్లముమీఁదిదారపుఁబోగును దీసివేయుచు మందస్మితముతోడను జంచలన్నేత్రాంచలముతోడను మెల్లఁగ మాటలాడుచుండెను గాని సీతాకాంతమున కేమియు వినఁబడలేదు. ఆపెయు నతఁడును ముఖములు దగ్గఱగ నుండునట్లు వంగి చాలసేపు మాటలాడిరి. ఒక్కసారి గాలి కాపెచీరకొంగు యౌవనునికోటునకుఁ దగిలెను. ఆపె చెఱఁగు సవరించికొనెను. సీతాకాంత మాసమయమున నొక్కొక్కప్పుడు తరుణీప్రేమనుగుఱించి, కులకాంతలస్థితినిగుఱించి, వేశ్యాస్వచ్ఛందవృత్తినిగుఱించి, హిందూసాంఘికధర్మములనుగుఱించి, హైందవదంపతులపరస్పరానురాగమునుగుఱించి యాలోచించుచుండెను.

## ౨ వ అధ్యాయము.

బండి యొకమజిలీయొద్ద నాగెను. యౌవనుఁడు దిగెను. అతఁ డటునిటు తిరిగి కటకటాల కల్లుకొనియున్నతీవెకుఁ బూలు పూచియుండ నొకగుత్తిని వ్రేలెడుకాడ యంటివచ్చునట్లు త్రెంపెను. దానినిఁ బట్టికొని యాతఁడు బండియొద్దకు వచ్చి నిల్చుండెను. యువతి యతనివంకఁ జూచుచుండెను. తీర రైలు కదలఁబోవునప్పు డతఁ డెక్కి బండితలుపు వేసి తనతావునఁ గూర్చుండెను. యువతి యతనిచేత నున్న గుత్తి తీసికొని మూచూచెను. దానినుండి కొన్నిపూవులు విడఁదీసి యాపె కొప్పుముడి

యందుఁ బెట్టికొనెను. మిగిలినవానినిఁ జేత నుంచికొనెను. సీతాకాంత మిది యంత చూచెను. సీతాకాంతమువంటివాని కెన్నియూహలు తట్టవు?

సీతాకాంత మార్షేయపౌరుషేయములు గలవంశమున జనించినబ్రాహ్మణుఁడు; ఇతనిపితృపితామహులు శిష్టాచారసంపన్నులు; వైదికకర్మానుష్ఠానపరులు; మాతామహప్రమాతామహులు పండితులు; కవులు; అఖండశివపూజాధురంధరులు. సీతాకాంతము పుట్టినది పల్లెటూరిలో; పెరిగినది పల్లెటూరిలో; సామాన్యవిద్య నేర్చినది పల్లెటూరిలో; కొన్నిసంవత్సరములు నివసించుటచేఁ బట్టణములయనుభవము కూడ దనకుఁ గల దని యతఁ డనుకొనుచుండును. హిందూదేశముయొక్క యాయువుపట్టు పల్లెటూ రని యతఁ డెంచుచుండును; ప్రాణము పట్టణమున నున్న దని యబ్బురపడుచుండును. ఇది విరోధమో, విరోధాభాసమో యని యతఁడు చర్చించుచుండును. హిందూసంఘముయొక్క స్థితి సీతాకాంతము తఱచుగా నాలోచించునంశములలో నొక్కటి యై యుండెను. ప్రేమించినవారిని వివాహ మాడవలయునా, వివాహ మాడినవారినిఁ బ్రేమింపవలయునా యనునది యతని కొకయనల్పప్రశ్నముగా నుండెను. అతనిభావప్రపంచంబులో మెలఁగుదంపతు లేగృహముల నుందురో యాగృహములు స్వర్గతుల్యము లని చెప్పవచ్చును. అట్టిదంపతులు సాధారణముగ హిందూగృహమున, సీతాకాంత మభిలషించినంతశీఘ్రకాలములోఁ గన్పట్ట రని సంఘచరిత్రము చదువువిద్యార్థులు చెప్పఁగలరు. సీతాకాంతము కూడ నట్లే యెంచుచుండెను. ఏదాంపత్యము హిందూసదనమున నిప్పటిలోఁ జూడ మని యతఁడు తలంచెనో, యాదాంపత్యలక్షణము లఛాయ చూడంజూడ బండిలోనియువతీయౌవనులయందుఁ గాన్పించినది. ఇది నిజ మగునా? సంఘ మింతస్వల్పకాలములోఁ బరిణామము నొందినదా? పాశ్చాత్యదంపతులను, నైశ్వర్యముతోఁ దులతూఁగుదంపతులను వీక్షించినవాఁ డయ్యు సీతాకాంత మత్తఱి నేలనో యాశ్చర్యపడెను. చివరకుఁ బ్రౌఢవేశ్య లిట్లభినయింతు రేమో యని యతఁడు తలంచెను; సందేహము వీడిన దని సంతృప్తి చెందెను. యౌవనుఁ డాపెకు శయ్య నమర్చుట, ఫిడేలు, పరపురుషసాన్నిధ్యశంక లేనియాపెచిఱునగవులు, బిలిబిలిపలుకులు, వసనస్పర్శనము, పుష్పగ్రహణవిలాసము నతనినిర్ణయమునకుఁ దోడ్పడెను. ఐనను నీ నిర్ణయమువలనిసంతృప్తి స్థిరముగా నుండినదికాదు. వేశ్యకుఁ బూచికపుల్లలకట్టతో నేమిపని? పని లేక యేమి కాని, వేశ్యలు తాల్చువేషచిహ్నము లాపెయం దచ్చటను

లేవు. స్వాభావిక సౌందర్యమును గప్పివేయుభూషణము లెవ్వియు లేక నల్లనికాంతుల నీనుచున్న యాపెకచభారము చెవులను దాఁకుచు వెనుకకు జారి సొగసైనకొప్పుమ్మడి కలిగి యుండెను. కంఠమునందలిహారాదు లేవియు సీతాకాంతమునకుఁ గన్పట్టలేదు. ఒక యొక్క గుండీ మాత్రము మెఱయుచు నగపడెను. సౌందర్యవతుల నేకులలక్షణము నతఁడు కావ్యములలోఁ జదివియుండెను గాని యీయాపెకన్నులకంటె విలక్షణము లైనవి సౌందర్యమునకు లోటు తెమ్పునేమో యని యతఁడు తలఁచెను. ఆపె యల్లన యౌవ నునితో మాటలాడుచు మందస్మితము చేసినప్పు డెల్లను గన్పట్టినసన్ననిపలువరుస కుపమా నము లేదని యతఁ డనుకొనెను. పురుషులకుఁ జిత్తభ్రమము కలుగఁజేయుతళుకు బెళుకులు గాని మైపూఁతలు గాని యాపెయందుఁ గన్పట్టలేదు. సౌశీల్యమునకు, మార్ద వమునకు, నిష్కపటవీ్రడాభరమునకు నాపెనెమ్మోము ప్రకటనపత్రికవలె నుండెను. ధరించినవస్త్రము వన్నెలు గలది కాదు; ముక్కలివిలువ గలది కాదు. లంగానలెఁ జుట్టును ముడుతలుగా నమర్పఁబడినకలంకారిచీర నేర్పుతోఁ గట్టికొని దానిపై గజ్జలు లేనిరెండువేళ్ళవెడల్పు గలయొడ్డాణమును ధరంచెను.

సత్యమునందలియన్నృతమును, నార్జవమునందలికౌటిల్యమును, సౌందర్యమునందలి వైరూప్యమును, గనుఁగొనవచ్చు నని నమ్ముచుండినసీతాకాంత మాసమయమున విభ్రాంతి ముద్రాంకితవదనమును దాల్చియుండెను. ఇంగ్లాండు మొదలైనపరదేశములకుఁ బోయి వచ్చినదంపతులను, నవనాగరకత గలదంపతులను, సరసము లాడుకొనుదంపతులను, ముచ్చ టలు చెప్పుకొనుదంపతులను, ననేకపర్యాయములు పట్టణములయందును బల్లెలయందును జూచినసీతాకాంతము వీరు దంపతులు కా రని నిశ్చయించికొనుటలో నాశ్చర్యము లేదు కాని యతఁ డీనిర్ణయము మాత్రము కొంచె మాలోచించియే చేసెను. అతఁడు పదునేడవయేట హిందూవివాహములనుగూర్చి యిచ్చినయుపన్యాసమును గూడ జ్ఞప్తికిఁ దెచ్చికొనెను.

## ౫ వ అధ్యాయము

మూరలు గడచి, బారలు దాఁటి, పరుగులు మీఱి, యామడ లతిక్రమించి బండి బృహద్రిక్షన్నువలె ఘనధ్వనితో నిప్పులు చెరుగుచుఁ జనుచుండెను. కాక యపరిమిత ముగా నుండెను. వడగాడ్పు తాపజనకముగా వీవసాగెను. మూఁడవయాతఁడు లేచి కూర్చుండెను. ఒడలిమీదిచొక్కాను విడిచి వంకికిఁ దగిల్చెను. వీ రేకులముువారో

యని సందేహపడుచున్న సీతాకాంతము వారు ద్విజేతరు లని తత్క్షణమే గ్రహింపఁగలిగెను. మూఁడవయాతఁడు తువాలుతో విసరుకొనుచు “ఇశ్శో! ఏమివడండి” యనెను.

సీతా—పాపము. మీరు సికిందాబాదునకుఁ బోవలయును గాఁబోలును. మిక్కిలిదూరపప్రయాణము.

మూఁడ—అవును. రేపు గాని చేరము.

సీతా—అక్కడఁ బని యుండి పోవుచున్నారా? అదియే వాసస్థానమా?

మూఁడ—ప్రస్తుత మచ్చటనే నివసించుచున్నాము.

సీతా—సికిందాబాదు మంచిపట్టణ మేనండీ?

మూఁడ—మంచిదే కాని పెత్తనము వచ్చినమాబోంట్లకుఁ దగదు.

సీతా—అ దేమి? అట్లందురు?

మూఁడ—ఏమో లెండి.

సీతా—ఎండ లెక్కువగా నుండును గాఁబోలు.

మూఁడ—అది కా దండి.

సీతా—మఱి యేమి?

మూఁడ—కాలక్షేపములు, ఉపన్యాసములు చాల తక్కువ.

సీతా—అచ్చటివిశేష మేది?

మూఁడ—ఇన్నిమాట లెందుకు? యౌవనులకు సౌఖ్యకరమైనపట్టణ మండి.

సీతా—నా కర్థము కాలేదు.

మూఁడ—అర్థము కాని దే మున్నది?

సీతా—యౌవనుల కనఁగాఁ గష్టము చేయఁగలదృఢకాయులకా?

మూఁడ—కాదు కాదు. యౌవనులకు. ఏ మని విప్పి చెప్ప మందురు?

సీతా—ఓహో! తెలిసినది. బహుళః భోగమువారు—

మూఁడ—వారే కా దండి. అది యితరులలోఁ గూడ నచ్చట నెక్కువగా నున్నది.

సీతా—అచ్చటనే కాదు. అన్నిపట్టణములలో నంతే. పల్లెలలో మాత్రము?

మూఁడ—అట్లనకుఁడు. అన్ని యాతీరున నుండవు.

సీతా—అయితే మీ కట్టిపట్టణము తగ దనుకొందును.

మూఁడ—మామఱఁదివంటితరుణవయస్కు లాపట్టణము విడువరు.

సీతా—అయితే—మీమఱఁది యెవరు?

మూఁడ—వీఁడే.

సీతాకాంతము ముఖముభారము దించిన ట్లగపడెను.

“నిజ మిప్పుడు తేలినది. వేశ్యను వెంటఁ బెట్టికొని పోవుచున్నాఁడు. యథార్థము కనుఁగొనుట యెంతదుస్తరము? శయ్యామందిరంబులం దప్పఁ దక్కినసమయంబుల మూతులు ముడిచికొనియుండు హైందవకులకాంత, శాకవాంఛనో, లవణాపేక్షనో, తండులాకాంక్షనో, కంఠహారోత్కంఠనో, భర్తృహృదయంబును బట్టు హైందవకులకాంత, సంతానఫలముకొఱకు నెలకొల్పఁబడినవృక్షమువలె, పచనసమ్మార్జనాదికార్యములకుఁ గనుఁగొనఁబడినయంత్రమువలె, బహువిధాలంకారధారణమునకుఁ జేయఁబడినకీల్బొమ్మవలె, బాహ్యేంద్రియతృప్తికై సృజింపఁబడినవస్తువిశేషమువలె, గృహస్థుఁ డుపయోగించుకొను హైందవకులకాంత, జ్వాలయై, మకరమై, వ్యాఘ్రిమయి, సంసారమును గరాళాగ్నిగను, మహాసాగరంబుగను, సాంద్రారణ్యంబుగను, గన్పట్టఁజేయు ననుసపవాదము గల హైందవకులకాంత, యీయువతి యెట్లగును?” అని యతఁడు తలపోసెను. కాని యామె మోము చూచినపు డెల్ల నతని కనుమానములు హెచ్చఁ జొచ్చెను. “ఆమె వేశ్య యైనయెడల మతమునందు శ్రద్ధ, దైవమునందు భక్తి గలమూఁడవయాతఁ డామె చేతిభోజనపదార్థము భుజించునా?” యని యతఁ డనుకొనెను.

## ౬ వ అధ్యాయము.

బండి పోయి పోయి యొకమజిలీయొద్ద నాగినది. జనము కిటకిటలాడుచుండెను. ఇద్దఱు పోలీసులు నొకసబ్బిన్స్పెక్టరు నొక్కచో నిల్వఁబడియుండిరి. ఇనస్పెక్టరుచేతిలో టిల్లిగ్రాఫుకాగిత ముండెను. పెట్టెపెట్టె పరీక్షింపసాగినజవానులలో నొక్కఁడీ పెట్టెయొద్దకు వచ్చెను. సీతాకాంతము కూర్చుండియుండెను. యౌవనుఁడు యువతితో నవ్వుచు మాటలాడుచుండెను. యౌవనుని జవాను లేచి రమ్మన్నాఁడు. మూఁడవవాఁ డదేమి యన్నాఁడు. యౌవనుఁ డెందు కన్నాఁడు. దిగుదువా దిగవా? యని జవాను గట్టిగ మాటలాడినాఁడు. యౌవనుఁడు దిగెను. మూఁడవయాతఁ డనుగమింపఁ బోయెను. జవాను వారించెను.

చీమను జంప నొల్లనిహస్తము మనుష్యశిరస్సును ఖండించుటకు వెనుదీయదు. నేఁడు హంసతూలికాశయ్యయందు సుఖపడినదేహము రేపు కఠినభూతలంబునఁ బొరలాడును. సరససల్లాపములచే, మందహాసములచే, వికసించుచుండినముఖమునందు నెత్తురుబొట్టు లేకుండఁ బోవుచున్నది.

కీర్తిస్తోత్రములు వినినచెవులు విషదిగ్ధశూలసమానము లైనవచనంబు లాకర్ణించుచున్నవి. మిత్రుఁడై యింటికి వచ్చినవాఁడు శత్రుఁడై బయటి కేగుచున్నాఁడు. మాధుర్యమును జవిచూపిననాల్కయడుగుననే విషము డాగియున్నది. థూ! జారత! ఇసీ. ఇంద్రియలోలత! అయ్యో! మనుష్యచరిత్రమును స్త్రీ లెట్లు మార్చివేయుచున్నారు! స్త్రీ వలఁచిపట్టుట మొదటినుండి మనుష్యుని కెడతెగనిప్రయత్నముగా నున్నది. 'నభజేత్ స్త్రీస్వతంత్రతా' మని చెప్పినమనువున కీస్త్రీలప్రవృత్తి యెంత గర్హ్యముగఁ గాన్పించెనో! మునీ! నమస్కారము. పూర్వయామమునఁ దమ్మలపాకుమడుపు లందిచ్చుచు భర్తృపార్శ్వమున నుండినస్త్రీ యుత్తరయామంబునందుఁ బతిగృహముయొక్క గడపపైఁ జివరయడుగు పెట్టఁబోవునప్పు డాపెహృదయమునఁ జొచ్చుటకు యముఁడు మాత్రము వెఱవకుండునా? పెనిమిటి కపకీర్తి రానిమ్ము. పుట్టినిల్లు కళంకితము కానిమ్ము. స్త్రీల నన నేల! పురుషులో! ఏమి యౌవనుఁడా! ఆనందము! నీ వెవ్వతెతో నవ్వుచు మాటలాడుచుంటివో! ఎవ్వతెమృదుశరీరము నీయధీన మనుకొని మురిసితివో! ఆపె వంటిదే నీసోదరి యని యెంచుము! ఆపెవంటిదే నీ భార్య యని తలంపుము. నీకన్నులెఱ్ఱబడ వొకో! నీగుండె కుముల దొకో! నీయానంద మడుగంట దొకో! దేవుఁడు దుష్టసర్పము తలపై వేయుటకు దండము నెత్తి సిద్ధముగా నున్నాఁడు. యౌవనుఁడా! శీఘ్రముగఁ జిక్కితివి. ఆహా! వృద్ధుఁ డెంతటి మోసగాఁడు! మఱది యఁట. సికింద్రాబాదులో నేమో జరుగు నఁట. అది తనకు సరిపడ దఁట. మత మఁట. కాలక్షేపమఁట. ఎవరిని నమ్మవచ్చును? సీ! మాయ! ఆహా! మోసము! ఎంతలో నెంతగా మాఱినది.

ఇట్టిపనులు జరుగువేళల నొక్కొక్కతఱి ముష్టిఘాతములు, దండతాడనములు, హత్యలు సంభవించుచుండును. పేరుప్రతిష్ఠలు గలవంశములలో నేతాదృశకార్యముల వలనఁ గలుగుసంక్షోభము వర్ణించుట యనవసరము. రైళ్లమూలమునఁ గొంచె మీపని సులభ మైనది గదా యని యాసమయమునఁ దోఁపకమానదు. యౌవనుఁడు పోయి పదినిమిషము లైనది. యువతి తల వంచి యాలోచించుచున్నట్లగపడెను.

ఇనస్పెక్టరు బండియొద్దకు జవానును వెంటఁబెట్టికొని వచ్చుచుండెను. సీతాకాంత మిది యంత యాశ్చర్యముతోఁ జూచుచుండెను. సీతాకాంతముఖావ మెట్టిదో కాని వారు దగ్గఱకు వచ్చినకొలఁది నతనిముఖము విన్ననాయెను. ఇనస్పెక్టరు, జవాను, బండితలుపునొద్ద నిల్వఁబడి నిమిషము సేపు అప్ప వాల్పక చూచిరి; దిగి బూటుకాళ్ల చప్పుడు టకటక వినవచ్చునట్లు శీఘ్రముగ నడచి యొకగదిలోనికిఁ బోయిరి. బండి కదలుటకు సిద్ధముగా నుండెను. యౌవనుఁడు, మూఁడవయాతఁడు బండిలోని కెక్కిరి, మహావేగముతో నది పరుగెత్తెను. వారు నవ్వుచుఁ దేలికగ నేమేమో మాటలాడికొనిరి.

## ౭ వ అధ్యాయము.

అఖండతమోబాహుళ్యం బైననిశీథినీద్వితీయయామంబునందుఁ దరుణార్కబింబ మరీచీపుంజంబుచే వికసితశతపత్రంబు లగుసరోవరంబులను వీక్షించి వీక్షించి సారసారా వంబు నాకర్ణించుకాలమున నయ్యది మిథ్య యని యెవ్వఁడు తలంచును? జ్ఞానేంద్రి యాంతఃకరణగోచరం బైనకారణపరంపర యేకార్థప్రతిపాదనపర్యాప్తం బై యుండఁ బ్రమాప్రమామీమాంసాపరత్వంబు బుద్ధికి ఘటించుట యెట్లు?

ఆహా! మిథ్య! జలద్రవత్వంబు మిథ్య. పాషాణకఠినత్వంబు మిథ్య! సూర్యప్రభా ధవళత్వంబు మిథ్య. సర్వచరాచరప్రపంచబాహ్యస్వరూపంబు మిథ్య.

మంట తీసినపిమ్మట పాలపొంగువలె సీతాకాంతముభ్రమ తగ్గఁ గడంగెను. మిమ్ము జవాను పిలిచిన దెందు కని యౌవను నడుగఁ దలఁచెను. కాని ప్రత్యు త్తరము చెప్పుట కతనిమన స్సెంత నొచ్చునో యని సీతాకాంతము మానెను; కొంచెము సేపూరకుండి మూఁడవయాతనితో "ఎండవేడిమి కొంచెము తగ్గినది." అనెను.

మూఁడ—ఇప్పుడిప్పుడు తగ్గినది. ఇంకను దగ్గలే దనియే చెప్పవచ్చును.

సీతా—సికిందా్రబాదులో నెండ లె ట్లుండును?

మూఁడ—ఎక్కువగా నుండును. మీనివాస మెక్కడ?

సీతా——————లో

మూఁడ—అక్కడ నుద్యోగములో నున్నారా?

సీతా—అవును.

మూఁడ—ఏమియుద్యోగము? అనవసరప్రసంగ మని తలఁపరేనిఁ జెప్పుఁడు.

సీతా—కాదు కాదు. చెప్పక దాఁపవలసినది లేదు. ——లో నున్నాను.

మూఁడ—ఆఁహ!

సీతా—అయితే మీ మేనకుమారులా వీరు?

మూఁడ—కాదు కాదు. వీనిచెల్లెలిని నా కిచ్చిరి. రెండవసంబంధము.

"సరి. సంశయము తీఱినది. యువతి యౌవనునికిఁ దోఁబుట్టువు. మూఁడవ యాతనికి భార్య. కనుకనే యాపె మూఁడవయాతనితో విస్తారముగ మాటలాడినది కాదు. ఆయనకు దూరముగాఁ గూర్చుండియున్నది. దీనిలో నాశ్చర్య మేమి లేదు. అయ్యో! విలాసవతి యైనయువతి నీవృద్ధున కియ్యఁ దలిదండ్రులకుఁ జేతు లెట్లాడెనో! నే నీదేశమునకు నిరంకుశప్రభువ నగుదునేనిఁ గ్రూరుఁ డైనయాతండ్రియొద్దనుండి యతనిభార్యను వేఱు చేసి యతని కెనుబదిసంవత్సరములవిధవ నిప్పించి పెండ్లి చేయించియుందును. దేవుఁ డనువాఁ డొకఁ డుండినయెడల, నతనిచేతిలో దండ మనునది యొకటి యుండినయెడలఁ దప్పక యది యాతండ్రిపై వాలును. ఆపెజీవయాత్ర యెట్లుగడచునో?" అని సీతాకాంతము తలంచెను. కాని వెనుకటిసంగతులు జ్ఞప్తికి రాఁగా మరల సందేహము లంకురించెను. సీతాకాంత మెఱిఁగినచెల్లెండ్రవలె మాత్రమే యాపె యౌవనునియెడఁ బ్రవర్తింపలేదు. తోఁబుట్టువు లంద ఱొక్కతీరున నుందురా? ఎవ్వరిమక్కువ లెట్టివో? అయినను యౌవనుఁడు యువతియు నేదియో కొంత తిని పిమ్మట మూఁడవయాతనికిఁ బెట్టిరే. భర్త యెదుట నుండినసమయమున నతనికంటె ముందుగ దేని నైనను భార్య భుజించునాచారము హిందువులలో లేదు. లోపల భక్తి లేకపోయినను నల్వు రే మైన ననుకొందు రేమో యని యైన, భర్తకుఁ గోపము వచ్చునేమో యని యైన భార్యయేతాదృశమర్యాదల నతిక్రమించుటకు సాహసింపదు. యువతి పెంకెభార్య యేమో? పెంకెభార్యసోదరుని వృద్ధుఁడు ప్రేమించుట యెట్లు? వృద్ధుడు సీతాకాంతమునకుఁ దనమఱఁదిని గుఱించి చెప్పునప్పు డతనియందు వైముఖ్యము గాని కోపము గాని కనఁబఱుపలేదు. ప్రేమపాత్రుఁ డైనబంధువునుగుఱించి యెట్లు చెప్పవలయునో యట్లు చెప్పెను. యువతికి వృద్ధుఁడు భర్త యని తలంచుట కనేకాధారము లుండెను గాని సీతాకాంతముయొక్కనిశ్చయమునకుఁ బైసంశయములు పండునకుఁ బుచ్చువలె నుండెను. ఎందు కీయనవసర మైనవిచారము? ఏల యీలేనిపోనిశంకలు? తెలిసికొనవలె నని యున్నచో యువతి మీ కేమి కావలయు నని యౌవనునో

వృద్ధునో యడిగిన నిమిషములోఁ దేలును గదా యని మనకుఁ దోఁచుచున్నది. సీతాకాంతమున కట్లు తోఁచినదో లేదో? అతనిమనస్సు మెత్తనిది. నిర్దోషులహృదయములఁ గలంచుట పాప మని తలంచువాఁడు.

## ౮ వ అధ్యాయము.

బండి యొకమజిలీయొద్ద నాఁగఁగా సీతాకాంతము దిగి పానపాత్రములో నీరు నింపికొని శీఘ్రముగ వచ్చి తనపెట్టెలో నెక్కెను. నీరు త్రావి చెంబు క్రిందఁ బెట్టి "మీరు సకుటుంబముగ యాత్రకు వెళ్లి వచ్చుచున్న ట్లున్నది. యాత్రావిశేషంబులు చెప్పుఁడు" అనెను.

మూఁడ—లేదండి. నాభార్య సికిందరాబాదులో నున్నది. ఒక్కఁడనే చెన్నపట్టణము వెళ్లి వచ్చుచున్నాను.

సీతా·—మీకుఁ బిల్ల లెందఱు?

మూఁడ—ఇద్దఱుకొడుకులు, ఒకకూతురు.

ఇంతలో నలువురుమనుష్యులు గబగబఁ దలుపు నెట్టికొని వీరిపెట్టెలో నెక్కిరి. వారిలో నిద్దఱకు వెనుకజుట్టు లేదు; బిరుసుపాఁటినముందఱిపాపట యుండె. తక్కిన యిద్దఱకుఁ గుండేటివంకజుట్టులు పెద్దవి యుండెను; గొఱిగించికొనుభాగము మూఁడు వ్రేళ్లకుఁ గొంచెముతక్కువగనో యెక్కువగనో యుండెను. వారిలో నొకఁడు వేసికొనినయుత్తరీయముయొక్క జరీ చేరెడునలువెడల్పున నుండెను. ఎక్కి కూర్చుండినది మొదలు వారిలో నెవఁడో యొకఁడు తల యెత్తినప్పు డెల్లను యువతివైపు చూచుచుండెను. ఒకఁడు సిగరెట్లు తీసి తక్కినమువ్వురకు నిచ్చి తా నొకటి పెదవులసందునఁ బెట్టికొనెను. ఒకఁ డాయువతి యుండినబల్లకు సమీపమున నున్నకిటికీయొద్దకుఁ బోయి సిగరెట్టు కాల్వ మొదలిడెను. తక్కినమువ్వురు స్వస్థానములయం దుండి కాల్చుచు నయవంతులకర్ణములకు శూలసమము లైనమాట లాడ నారంభించిరి. ఆమాటలు తెలుఁగు రానియువతికిఁ గాని మూఁడవయాతనికిఁ గాని తెలిసినవి కావు. యౌవనుఁడు వారిపైఁ గ్రోధదృష్టిని బఱపుచుండెను. సిగరెట్టు కాల్చుట కొకఁ డాపెసమీపమునకుఁ బోయె నని చెప్పియుంటిమి. అప్పుడే యాపె వెనుకకు జరిగెను. వాఁడు కొంతసే పుండి తన పూర్వస్థానమునకుఁ జేరెను. ఘాఁగ యెక్కువైనది. వారిపకపకలు హెచ్చినవి. యువతి వృద్ధునితో నేమో మెల్లఁగ మాటలాడినది. సీతాకాంతమునకు వీరిచేష్టలు

దుస్స్వభావముగ నుండెను. మూఁడవయాతఁడు ముందటిపాపటవానిం దిలకించి "మీరు చదివికొనినవారే. ఇట్లు మాకుఁ గష్టము కలుగఁజేయవచ్చునా?" యని యింగ్లీషులో ననెను. ఆమాట లతనికిఁ దెలిసినవికా వని సీతాకాంతము గ్రహించి తెలుఁగులోఁ జెప్పెను గాని వా రూరకుండలేదు. ఒకఁడు మాత్రము సిగరెట్టు పాఱవైచెను. పై మజిలీయొద్ద నల్వురు దిగి యాపెను జూచుచుఁ బోయిరి.

సీతా—చూచితిరా యీదుష్టు లెంతయల్లరి చేసిరో!

మూఁడ—వారియఱపు నా కసహ్యాముగ నున్నదండీ.

సీతా—వారిమాటలు గుణవంతులును, స్త్రీలును వినఁదగినవికావు.

మూఁడ—దుర్నీతిప్రసంగము చేసిరా?

సీతా—ఏమి చెప్పుదును.?

మూఁడ—నాకుఁ దెలిసియుండినచో నప్పుడే పోలీసువారికిఁ బట్టియిచ్చి యుందును. కులస్త్రీ లున్నప్పు డిట్లు దుర్వాక్యము లాడుట పెద్దనేరము.

దిగిపోయిరి గదా యని ప్రత్యుత్తర మిచ్చి పరుపునకుఁ దల యానించి సీతాకాంతము పరుండెను. ఇంతకుఁబూర్వము యువతినిఁగూర్చి యతఁ డనేకవిధముల నభిప్రాయపడియుండెను. ఆపె భ్రష్ట యేమో యని యొకప్పుడు భ్రమ పొంది యుండెను. అట్టిసమయములో నాపె కులస్త్రీ యని వృద్ధునిమాటలవలన స్పష్టముగాఁ దెలిసికొనినప్పు డతఁడు విగతాలోకుఁ డయ్యెను. యువతి వృద్ధునికి భార్య కాదని నిశ్చయముగా నతఁ డెఱుంగుట కిదివఱకే యవకాశము కలిగె నని చదువరులకు జ్ఞప్తి యుండి యుండును. వృద్ధుని కాపెకూతు రేమో యని యతఁ డనుకొనెను. పోలిక గాని యితరకారణములు గాని కన్పట్టనందున నాపె యౌవనునికి సోదరి యై యుండు నని తలంచెను. పొడుగుకాళ్ళు, చిన్నకోలతల, యేటవాలుగా నున్నముఖము, కొంచెము పై కుబ్బి దీర్ఘముగా నున్నముక్కు, పలుచఁబాఱినచెంపలు, కలిసి సౌందర్య మనవచ్చునేని, యౌవనుఁడు సుందరుఁడే యగును.

కాని యాపెసౌందర్యమునకు నితనిసౌందర్యమునకు సంబంధమే లేదు. పసిమి వన్నె గలయాపెశరీరప్రభకు నితనిశరీరకాంతికిఁ దారతమ్యము హెచ్చు. దీనిలో నాశ్చర్య మే మున్నది? పురుషులసౌందర్యము పురుషులదే. స్త్రీలసౌందర్యము స్త్రీలదే. పోలిక లేనితోఁబుట్టువు లెందఱు లేరు. ముగ్గురు ప్రచ్ఛన్ను లేమో?

కారని మాత్రము సీతాకాంతము నమ్మెను. వారిమొగములు చూచినఁ గారనియే తోఁచును. మెఱుపు మెఱసిన ట్లొకయూహ సీతాకాంతము బుద్ధికిఁ దట్టుఁడు, "యౌవనుని కీపె భార్య మాత్ర మేల కాఁగూడదు? సంఘవ్యవస్థ మాఱకపోయినఁ బోవును గాక! వ్యక్తుల కన్నిటికి సామాన్యదశ యుండునప్పటికిని వ్యక్తు లన్ని సమాన దశయం దుండవు. సామాన్యదశ కందరానియుచ్చదశయం దుండినవ్యక్తులను జరిత్ర పుటలలోఁ జూచుచున్నాము. అఱవిచ్చినమొగ్గలమధ్యమున నొకవికసితపుష్ప మగపడుచున్నది. తిర్యక్కు లైనవానరములలో నొకరెండుకాళ్లకోఁతి కనఁబట్టుచున్నది. ప్రకాశవిహీను లైనమానవులలో నొకతేజోవిలసితుఁడు పొడకట్టుచున్నాఁడు. ఈదృశ దాంపత్యము హిందూదేశమునకు నూతనము కాదు సుమా. మానసమా! గోదావరీ సరిత్పరిసరంబులఁ బులినసీమలయందలిప్రత్యూషపవనాంకూరములును, శాద్వలతలంబులందలి హరిణపోతంబులును, సరోవరంబులందలిశతపత్రదళంబులును, లతాగృహంబులందలిశబల శుకంబులును నహరహంబు చెప్పినకథనే వినువక చెప్పుచున్నవి. గ్రహించితివే! కుల కాంతయొక్క ప్రేమచే నొకనికి శూన్యభూభాగంబులు ప్రాసాదాంతరాళచంద్రోపల కుట్టిమము లైన వఁట. కులకాంత యగపడక శోకించినయొక్కనికన్నీటివేడిమి భరింప శక్యము కానిదిగా నుండె నఁట. ఒకఁడు జలబిందువులనుగుఱించి తనకులకాంత కేమో చెప్పఁగా వానినిఁ బట్టికొనఁ జేయి చాచి విఫలమనోరథ యై ప్రియునివంకఁ జూచి మందస్మిత మొనర్చినయాపెలజ్జ చూచినఁ గాని తెలియ దఁట. ఒకకులకాంత తన తొడపై నిద్రించుచుండినభర్త మొగంబునందు మరుద్వశంబునఁ బుష్పములు రాల నిద్రాభంగము కలుగు నని తలఁకి యవి యెచ్చటినుండి పడెనో తెలిసికొనుటకు నటునటు చూచుచుండెడుసమయమున నాకస్మికముగ రాలి పడినపూవుల మెల్లఁగ దీసి వైచినట్టి యాపెప్రియానురాగమును వర్ణింప నలవికా దఁట. ఓహో! పూజ్యదంపతులు! ఓహో! హిందూదేశము పవిత్రము. కులకాంతా! వర్ధిల్లుదువు గాక! ప్రేమా——"

ఇట్లనుకొనుచుండ హఠాత్తుగా నతనితలంపులపరంపర కంతరాయము కలిగినది. ఇదివఱకే జరిగిజరిగి యంచునకు వచ్చినపఱపు, క్రిందఁ బడినందున నతఁడు లేవవలసివచ్చెను. మూఁడవయాతఁడు సంభ్రమమ్మున దాని నెత్తి యతని కిచ్చెను. పఱపుతోఁ బాటు క్రిందఁబడినపుస్తకము నందికొని సీతాకాంతము చదువుకొనుచుఁ గూర్చుండెను. ఎడనెడ

నతనిమనస్సు యువతిపైకిఁ జనుచుండెను. ఈవిచారముమీఁద నతని కేల విసువు జనింప లేదో! ఉన్నట్లుండి మూఁడవయాతఁడు "అయ్యా! ఆపుస్తక మేమిటి?" అని యడిగెను

సీతా—ఏదోతెలుఁగుపుస్తకము.

మూఁడ—ఇటు తెండు.

సీతాకాంత మిదిగో యని యిచ్చెను.

మూఁడ—(అట్ట చూచి) మీపే రేమండి?

సీతా—నాపేరు సీతాకాంతము.

మూఁడ—(లేచి కరమునఁ గరము గీలించి) మీరు గ్రంథకర్త లని నే నెఱుఁగను.

సీతా—ఏమిగ్రంథము లెండు. ఏదోయొక—

మూఁడ—మీయొద్ద నింకను బ్రతు లున్నవా? నాకుఁ దెలుఁగు తెలియదు. తెలిసినచో నొకపుస్తకము తీసికొనియుందును. నాభార్యకు మాత్రము తెలుఁగు బాగుగ వచ్చును.

సీతా—నావద్ద నింకొకప్రతి యున్నది. మీభార్య చదువఁ గలదు గదా. తీసికొనుఁడు.

మూఁడ—(అనుమానించి) నాకు గృహసంబంధము లైనచిక్కులు తటస్థించి యున్నవి. పిల్లవాఁ డింటర్మీడియేటులోఁ జదువవలసియున్నది. వానిజీతము——

సీతా—(గ్రహించి) మీరు డబ్బియ నక్కఱ లేదు. మీరు స్వీకరించినయెడల సంతోషపూర్వకముగా నొసఁగెదను.

మూఁడవయాతఁడు పుస్తకమును జిఱునవ్వుతోఁ గైకొని యింటికిఁ బోయి మీకు డబ్బు పంపెద ననెను. పుచ్చుకొన నని సీతాకాంతము చెప్పెను. "నాభార్యచేతఁ బుస్తకమును జదివించి యర్థము చెప్పించికొనియెదను. ప్రతిదినము గ్రంథమును జూచి మిమ్ము స్మరించెదను. మీదయ నే మని కొనియాడఁగలను.? ఇఁక నేమి చెప్పినను ముఖస్తుతిగా భావింతు రేమో యని తలఁచి మాటలాడఁజాలకున్నాను." అని మూఁడవయాతఁడు వచించెను.

సీతా—అయ్యా! దీనిలో నాదయ యేమియు లేదు. క్షుద్రజీవి నైననాదయ యెంత! మాతల్లిబాస ద్రావిడకులాంగనాజిహ్వాగ్రమునఁ గూడ వెలయుచున్న దని విని నప్పుడు నాశరీరమునఁ బులకలు పొడమినవి. నాడులయందు రక్తము తీవ్రముగఁ

బాఱినది. నాకు మాభాషాచరిత్రమంత యొక్కసారి జ్ఞప్తికి వచ్చినది. కవు లందఱు మనస్సునకుఁ దట్టినారు. రాజు లందఱు స్ఫురణమునకు వచ్చినారు. ఏమియుత్సాహము! ఏమియానందము! అయ్యో! యుల్లాసము సన్నగిల్లినది. సంతోషము తగ్గినది. నల్లనిమేఘము కన్పట్టినది. వెలుంగు తొంగి చూచుచున్నది.

ఇత్తఱి మూఁడవయాతఁడు దిగ్భ్రమ చెంది చూచుచుండెను. సీతాకాంతము మాటలు తెలిసెనో లేదో కాని యాతఁడు మాఱుమాట యడుగలేదు.

సీతా—(మాఱ్పు చెందినముఖముతో) అయ్యా! మీభాగ్యచేతఁ జదివించి నా కప్పుడప్పు డుత్తరములు వ్రాయుచుండుఁడు. సికిందాబాదున కెప్పుడైన వచ్చితి నేని మీదర్శనము చేసెదను.

మూఁడ—తప్పక వ్రాయుదును. మీరు సికిందాబాదులో మఱియొకయింటికిఁ బోఁగూడదు. మాయింటికే దయచేయవలయును. మీకుఁ గావలసినయేర్పాటు లన్ని కావింతును. మాచిరునామా వ్రాసి యిచ్చెదను.

౭ వ అధ్యాయము.

యాావనునిబల్ల కొంచెముదూరమున నుండుటచే బండియొక్కఖట్ఖటారావంబున వీరిసంభాషణ మతఁడు వినలేదు. యువతి వీరివైపు చూచుచు నేమో తలపోసెను. కాలంబునుంబోలెఁ గొంచెఱ భూమిపై దింపి కొందఱఁ దనలో నిముడ్చుకొనుచు బండి యతివేగంబునఁ బోవుచుండెను. సాయంకాలమునాలుగుగంటలైనది. సూర్యాతపతీక్ష్ణం బుపశమించినది. సముద్రపుగాలి యల్లన వీవ నారంభించినది. వాడినప్రకృతిమొగంబు నకుఁ దెలివి వచ్చినది. మజిలీలయొద్దఁ జల్లముంత లగపడలేదు. పెరుగుముంత లగపడలేదు. మల్లెపూ లని యొకఁ డమ్ముచుండెను. మొగలిపూ లని యొకఁ డమ్ముచుండెను. యాావనుఁడు లేచి కూర్చుండెను. మూఁడవయాతఁడు పుస్తకము నతనిచేతి కిచ్చి వీరు రచించి రని చెప్పెను. అతఁడు కొంతసేపు చదివి "మీరు రచించితిరా?" యని యడిగెను.

సీతా—(అనిష్టముగ) అవును.

యాావ—చాల బాగుగ వ్రాసినారు.

సీతా—ఏమి బాగు లెండు. మీకుఁ దెలుఁగు వచ్చు నని తోఁచుచున్నది.

యాావ—మాటలాడఁగలను. చదివి యర్థము చేసికొనఁగలను.

సీతా—నేను మిక్కిలి సంతోషించుచున్నాను. అరవవా రైనమీరు కూడ మాతల్లిబాసను నేర్చికొనినారు.

యౌవ—నేను దఱచుగ రాజమహేంద్రవరము గుంటూరులలో నివసించుచుందును. సికింద్రాబాదులో మాయి ల్లున్నది. నే నెప్పుడును దెలుఁగుబ్రాహ్మణులతో మెలఁగుచుందును. అరవబ్రాహ్మణులు కూడ నక్కడ నున్నారు కాని, ఏమో—వారితో నంతగా—. నాస్నేహితు లందఱు తెలుఁగువారు గావున నాకుఁ దెలుఁగు వచ్చినది. అది గాక శ్రద్ధతో నేర్చికొంటిని.

సీతా—మీరో వారో సంగీతము పాడఁగల రని తలఁచెదను.

మూఁడ—నాకుఁ జేతఁగా దండి. మావాఁడే—

యౌవ—మాకు సంగీతము వచ్చు నని మీ కెట్లు తెలియును?

సీతా—ఫిడేలే చెప్పుచున్నది.

యౌవ—ఓహో! దానినిఁ జూచియా? ఏదో ప్రొద్దు పోక. ఎఱుఁగరు?

సీతా—మీ రట్లనక మ రే మందురు?

యౌవ—కా దండి. నిజముగఁ బ్రొద్దుపోవకయే. నాభార్య నిప్పుడు మాబావగారివెంట సికింద్రాబాదునకుఁ బంపుచున్నాను. నేను బెజవాడలో దిగిపోయెదను. నా కక్కడ నుద్యోగము. ఒక్కడను గనుక నింటియొద్దఁ బ్రొద్దుపుచ్చుటకు ఫిడేలు తీసికొనిపోవుచున్నాను.

సీతాకాంతముకన్నులు విస్తృతము లైనవి. పెదవు లల్లన విచ్చినవి. ముఖము త్రిప్పెను. అమావాస్యనాఁటి చుక్కలవలె నతనిబుద్ధిలోఁ దలంపులు నిండినవి. అన్వేషించి పోయినసొత్తును గనుంగొనినలోభియొక్కొ, మహాపట్టణంబున విచిత్రవస్తువు నవలోకించినజానపదుం డొక్కొ, చిరకాలధ్యానంబునఁ దత్త్వరహస్యంబు తెలిసికొన్నజ్ఞాని యొక్కొ, యన నతనిమోము కన్పట్టియుండు నేమో కాని మూఁడవయాతఁడు గాని యౌవనుఁడు గాని చూచియుండలేదు. "సత్యము. సత్యము- పవిత్రహిందూదేశంబునఁ బూజ్యదంపతులు సర్వకాలములయందుఁ గన్పట్టుచుందురు. ఏనాఁ డింటింట నిట్టిదంపతులు వెలయుదురు! హిందూభర్తా! ఏనాఁడు దాంపత్యపరమార్థంబు గ్రహించెదవు? ఆనాఁడు గదా గృహములు గృహములు. ప్రేమమా! అదిగో నీవు లేనిదంపతీహృదయంబు లెండి బండలై యున్నవి.

కులకాంతా! నిన్ను మామలు నిరాదరించుచున్నారు; అత్త లొత్తిగఁ ద్రొక్కుచున్నారు; ఆడుబిడ్డ లరకంటఁ జూచుచున్నారు. కొండంతవు లేలనో నీకు విషము పోసిరి. కులకాంతా! ఏనాఁటికి సుఖమును నొందెదవు!" అని యతఁడు చింతించెను. యానముఁడును యువతియు వానికి దేవతాయుగ్మమువలెఁ గన్పట్టిరి. అసూర్యంపశ్యయైన రాజపత్ని మొదలుకొని పిడిగుద్దులచే వీపు కాయలు కాసినయిల్లాలివఱకుఁ గల కాంత లందఱు వానితలంపునకు వచ్చిరి. భర్తచేఁ గొట్టులు వడకపోయినను బని చేయుట, తినుట, కనుట, సొమ్ములు పెట్టికొనుట తప్ప మఱియేమి యెఱుంగనికులకాంత లతని మనోనేత్రమున కగపడిరి; మూలను గూర్చుండి మాసినచీరచెఱఁగుతోఁ గన్నీరు తుడుచుకొనుకులకాంత యగపడెను; కలహానళంబున మాఁడుజాములవఱకుఁ బొగ లేని పొయ్యియొద్దకుఁ జేరి కట్టెల నల్లన సవరించుచున్నకులకాంత యగపడెను. వంటయింటిలోఁ గొంగు వేసికొని పరుండి నాకష్టము లెప్పుడు కడతేర్చెదవో భగవంతుఁడా! యని పిలపించుచున్నకులకాంత యగపడెను; పోరు పడఁజాలక కష్టగండ్లు తీర్చునారఁక లేరని నిరాశతోఁ బ్రాణములు తీసికొనుటకై బావికడకుఁ బోలేక పోఁబోవుచున్నకులకాంత యగపడెను. అయ్యో! అగ్రహారము లతనికి నరకకథలను జ్ఞప్తికిఁ దెచ్చినవి.

బ్రాహ్మణోత్తరుఁడు గాన యానముఁ డీడు వచ్చినయువతియొక్క గుణరూపములను జూచి వివాహ మాడియుండును. అస్మాద్దృశబ్రాహ్మణుల కీభాగ్యము లేదు గదా యని యతఁడు చింతించెను. పాపము సీతాకాంతమునకుఁ బ్రపంచజ్ఞానము లేనిచిన్నతనమున నొకపసికూనను బెండ్లి చేసిరి. అతనికి బదునైదు దాఁటినవి. ఇరువది గడచినవి. గడచి కొన్ని సంవత్సరము లైనవి. భార్య యొక్క తె యున్నదని నల్వు రనుచున్నారు. ఇప్పటికి నామె యితఁ డగపడినచో వ్యాఘ్రమును జూచినకురంగివలెఁ జాటునకుఁ జనుచుండును. ఆమెరూపు మితఁ డెఱుఁగడు. ఇతనిరూపు మామె యెఱుఁగదు. ఒకరి గుణము లొకరికిఁ దెలియవు.

ఈడుజోడు కుదిరి పొరలేనిమైత్రితో గృహములయందు మెలఁగుదంపతులను జూచి, మధుమాససాయంసమయములందు జలాశయతీరంబుల శీకరసమ్మిళితమరుత్కిశోరంబులకుఁ జొక్కుడుదంపతులను జూచి, మనోహరశరన్నిశావేళల లసచ్చంద్రికాపటలధవళితసికతాతలంబులందు సంసక్తబాహులతలతో నల్లన విహరించుదంపతులను జూచి

ప్రేమ కివి చిహ్నములా? ఉత్తమదాంపత్యమున కివి బహిర్గతగుణంబులా? యని యాలో చించుచుండెడువాఁడు. ఏవ్వరిదంపతులో తలంపునకు రాఁగా నా కిట్టి దాంపత్యము ననుభవించుభాగ్య మున్నదో లేదో యని తలంచుచుండెడువాఁడు కాని సంఘవలయములలో లేదనియే చెప్పఁదగిన యద్దాంపత్యము తనకు లభించు నని యతఁ డెట్లు తలంచును? యావనుఁడును యువతియు దంపతు లని స్పష్టపడినప్పటినుండి వారియం దతని కొకవిధ మైన భక్తి కలిగెను; అనురాగము జనించెను; వారికి నమస్కరించి వారినిఁ గొనియాడవలె నని యతనికి బుద్ధి పొడమెను గాని యట్లు చేయలేదు. గుణరూపములు గలిగి విద్యావతి యై తనను ప్రేమించినయువతిని, బ్రాహ్మణస్త్రీ కాకపోయినను, వివాహ మాడవలె ననుకోరిక యతని కుదయించెను గాని యేమో తలంపునకు రాఁగా నాసంకల్పము నాపివేసెను. మీపటము లే నైన నున్నదిం డని యావనుని నడుగఁ దలచెను. ఏ మనుకొందురో యని మానెను.

వల్లీకుసుమంబులందును, శుకీకంఠంబులందును, చమరీవాలంబులందును, భ్రమరీగీతంబులందును భారవశ్యము నొందుసీతాకాంత మాయువతీపదపంకజంబులందు మనోమాత్రగోచరంబైనయానంద మనుభవించియుండును. పాపభీతిచే నాపవిత్రస్త్రీ నతఁడు మాటిమాటికిఁ జూడఁజాలకుండెను. ఐదుగంట లైనది. బండి యొకమజిలీయొద్ద నాగెను. యావనుఁడు యువతిని దింపెను. ఇద్దఱును జలయంత్రమునొద్దఁ బాత్రములతో నీరు తాగిరి. యువతి యచ్చటనే వదనము కడిగికొని చెంబునిండ నుదకము పట్టి తెచ్చి యూఁడినయాతని కొసఁగెను. ఆపె కూర్చుండి భర్త యొద్ద నద్ద మడిగి తీసికొని వెండ్రుకలు సవరించి కొప్పుముడి వేసికొనెను. నల్వురలో నద్దము చూచికొనవలయునా యని భార్యలపైఁ బండ్లుకొఱుకుభర్తలను మాత్రము సీతాకాంత మెఱుఁగును. యావనునికి యువతియందుఁ గలప్రేమ, విశ్వాసము, మైత్రి, బ్రతికియుండునంతవఱకు మఱవఁజాల నని యతఁ డనుకొనెను. ఎంతయదృష్టవంతులో కాని యీభాగ్యము ననుభవింపరని యాతఁడు నిట్టూర్పు విడిచెను; మొదట నన్యోన్యానురాగము, పిదప వివాహము నైనచో నీ భాగ్యము లభ్య మగును గదా యని మరలఁ దలంచెను. కూతులను బహుప్రియముగ నుంచు తలిదండ్రులు మార్గము నిరోధించునడ్డదూలములవలె నతనికిఁ బొడకట్టిరి. ఆపెను వీక్షించినప్పుడెల్ల నతనికిఁ గ్రొత్తతలంపులు పుట్టుచుండెను. ఆనందము, ప్రేమ, విచారము, నుత్సాహము నతనికిఁ గలుగుచుండెను. సీతాకాంతమును జూచుచున్న దేమో యని

యొకప్పుడును యశోధనుఁడు భార్యపై ననుమానదృష్టిఁ బఱపినవాఁడు కాఁడు. భావ మెట్టిదో కాని సీతాకాంతము చిఱునగవుతో యశోధనునిఁ జూచి "మీసంగీతముచే మాచెవులకు విందు చేయరా?" యని మృదువుగ నడిగెను.

యశోధ—నాకింతయు బాగుగ నుండదు.

సీతా—మీకు బాగుగ నుండకపోవచ్చును. మాకు బాగుగనే యుండును.

మూఁడ—పాడుము. వా రింతగ నడుగుచున్నారు.

ఫిడేలు వాయింతు నని యెంచి యశోధనుఁడు సంచినిఁ దీసి పొడుగుపెట్టెలోని ఫిడేలును జేత ధరించెను; కొన్నితీగల బిగించెను; కొన్నిటి సడలించెను; వాయింప మొదలిడెను. మూఁడవయాతఁడు ముఖసంజ్ఞలచేఁ దనయానందమును దెలియఁజేసెను. యశోధనుఁడు కొంచెము సేపు కేవలము యంత్రముననే వాయించి పిమ్మట నిజస్వరంబును గూడఁ గలిపెను. సీతాకాంతముకడకంటికి యువతి గాన్పించెను. ఆపె మందస్మితము చేయుచు సీతాకాంతము చూచు నని కాంబోలు గవాక్షములోఁ దల దూర్చి ముఖమును మఱుఁగుపఱచెను. ఆహా! తనను ప్రాణముకంటె నెక్కుడుగఁ బ్రేమించినభర్త పార్శ్వమున మనోహరగానంబు సల్పుచుండ నని యానందపరవశ యగుభార్య సీతాకాంతము చూడలే దని తనభర్తను దిలకించి చిఱునగవు నాపుకొనుచుండ నతఁడు కన్ను మఱల్చి చూచినతోడనే యాపె మొగమును ద్రిప్పుకొనుచుండెను. ఆనగ నతనికి జేవ కాంతల స్ఫురింపఁజేసెను. ఆపెను బుష్పవలతోఁ బూజింపవలయు నని యతఁ డభిలషించెను. యశోధనుఁ డిది యేమి కనిపెట్టలేదు. అతనిగొంతునరములు, మొగమునరములు నుబ్బియుండెను. ఫాలముమీఁదను, గన్నులక్రిందియుబ్బుప్రదేశముమీఁదను జెమ్మట సూక్ష్మబిందురూపమున నుండెను. ఛామనచాయకు నలుపునకు మధ్యమున నున్నరంగు గలవాఁ డగుయశోధనుని కప్పు జేలనో ముందటిజుట్టు సొబగు నిచ్చుచుండ లేదు. పంట్ల మీయ లేకపోయినసోయగము నతనికి ద్రోసతియు నాత్మ రీయము నిచ్చు నని యాసపడుదుము. అయినను నాసమయమున నతనిమూర్తి సగ్గవముతో నేమిపని? ఏకాగ్రచిత్తంబునఁ బాడిపాడి యతఁడు చాలించెను. సీతాకాంతము గవాక్షముగుండ బయటికిఁ జూపు మఱల్చెను. సముద్రమును జేరంబోవుప్రాన్స్యటాన్స్లపునదీప్రవాహంబుంబలె బండి ధ్వని చేయుచు నధికరయంబున నేగుచుండెను. జీడిమామిడిచెట్లు సాంద్రము లై కాన్పించెను. మొగలిపొదలు గుబురులుగుబురులుగఁ గన్పట్టెను. బెస్త

వాఁడు పలనుంబోలె సూర్యుఁ డెంతను దనసమీపమునకు లాగుకొనుచుండెను. విశాల సికతాతలంబులందు నీడలు ప్రాకుచుండెను. యువతి వాని నంతటంతటఁ జూచును వచ్చినది. సీతాకాంతము చలువదోవతి పెట్టెనుండి తీసి కట్టికొనెను; క్రొత్తకోటు తొడిగికొనెను; జరీయుత్తరీయము నలెవాటు వైచికొనెను; గడియారమును జూచి “అయ్యా! మీరు నాకు సంగీతముచేఁ గలిగించినయానందమునకు మీ కెప్పుడును గృతజ్ఞుఁడ నై యుందును. మిమ్ము విడిచిపెట్టి పోవలసిననిమిషము సమీపించుచున్నది. జీవితాంతమువఱకు మిమ్ము మఱచిపోను.” అని చెప్పలేక చెప్పెను. సీతాకాంతమునే వారు మిక్కిలి ప్రేమించిన ట్లగపడిరి. దృగ్విధానముచేతను, ముఖవిన్యాసముచేతను, వచోమార్దవముచేతను దమయనురాగమును బరితాపమును దెలియఁజేసిరి. ఒకరి నొకరు మఱవవ ద్దనుకొన్నారు. ఉత్తరములు వ్రాసికొనుచుండ మనుకొన్నారు. చిరునామాలు కాగితములమీఁద నెక్కించుకొన్నారు. దయ యుంచవలసిన దనుకొన్నారు. పునర్దర్శన మయ్యెడు ననుకొన్నారు. ఎన్నిదినములకో కలియుట యనుకొన్నారు. ఎందుకుఁ గలిసెద మనుకొన్నారు. చేతులు చేతులు కలుపుకొన్నారు. మైత్రియొక్క మహిమ యేమి యనుకొన్నారు. అనుకొనుచుండఁగనే దీర్ఘ మైనధ్వని సీతాకాంతమునకు వినఁబడినది. అతనిగుండె దబదబఁ గొట్టుకొనినది. చూచుచుఁ జూచుచుండఁగనే బండి మొదటిసిగ్నలు స్తంభమును దాఁటినది. జెండాలవారిని దాఁటినది. నిలిచొక్కాలవారిని దాఁటినది. కట్టెగోపురమును దాఁటినది. కటకటాలు దాఁటినది. పట్టాలు శాఖోపశాఖ లై కాన్పించెను. మజిలీపేరు పెద్దయక్షరములతోఁ గన్పట్టెను. బండి యాగెను. సీతాకాంతముకొఱకుఁ గనిపెట్టికొనియుండిన మిత్రులు వెదకుచు నతని పెట్టెయొద్దకు వచ్చిరి. అతఁడు దిగెను. పెట్టె, పఱుపు మూఁడవయాతఁ డందిచ్చెను. అతఁడు మునుస్వామి మొదలియారుగారూ! సెలవు! రాజరత్నము మొదలియారుగారూ! సెలవు! అనుచు మూఁడవయాతనియొక్కయు యానునియొక్కయుఁ గరములఁ గరముం గీలించెను. ఏమేమో యైదునిముషములు మాటలాడిరి. గంటచప్పుడు బిగ్గఱగా వినవచ్చినది. పీకె పాడఁబడెను. కీచున గీపెట్టి యింజను బుస్సుబుస్సున బొగ విడిచినది. బండి మెల్లగఁ గదల నారంభించెను. వడి యెక్కు వయ్యెను. చిట్టచివరమూపు గదా యని యతఁడు యువతిని యానునిఁ జూచెను. “నేను గొలఁది దినములలో గృహస్థుఁడ నయినప్పుడు మిమ్ముఁ బ్రతిదినము స్మరించి యానందమో విచారమో పొందుచుందును.” అని యనుకొనుచు వారినిఁ దిరిగి చూచుచు మిత్రులతోఁ గలిసి సీతాకాంతము పురములోఁ బ్రవేశించెను.

# అయిదవ ప్రకరణము.

## బ్రాహ్మమతసిద్ధాంతముల కాధారములు.

---

పై నుదహరింపఁబడినమతవిషయములనుగుఱించిన బ్రాహ్మమతబోధనలు క్లుప్తముగాఁ దెలుపఁబడినవి. బ్రాహ్మమతసిద్ధాంతములు హిందూజాతీయసిద్ధాంతములే యయి యుండుటచేత తత్సిద్ధాంతబీజముల కాధారములు హిందూమతమునందే కలవు. అదిగాక పైసిద్ధాంతములనే యిక్కాలపువిద్యాధికులు పెక్కండ్రు కలిగియున్నారు. మనుజునికి సహజజ్ఞానము కల దనియు, మానవచరిత్రయం దాజ్ఞాన మభివృద్ధి నొందుచుండు ననియు, బ్రాహ్మమతమూలసిద్ధాంతము. సర్వజ్ఞుఁడైనభగవంతునిసంబంధుఁడే యగుటచేత మానవునియందును ఆసర్వజ్ఞత్వబీజములు అవ్యక్తస్థితియం దుండి క్రమక్రమముగా వ్యక్తము లయి యభివృద్ధి కాఁగలవు. జ్ఞాన మనునది పైనుండి వచ్చునది కాదు. తనలో నున్నజ్ఞానశక్తిని వెలిబుచ్చుటయే జ్ఞానాధిక్యతను బొందుట. ఈసంగతినే వేదాంతము బోధించుచున్నది. ఈవిషయము బృహదారణ్యకోపనిషత్తునందు మైత్రేయీయాజ్ఞవల్క్య సంవాదమున విపులముగా వివరింపఁబడినది. అయినను జనసామాన్య మీవిషయమును బాగుగా గ్రహింపలేక తెలిసికొనఁదగిన దెల్లను పైనుండియే రావలసిన దని, అనగా నేవిషయము నైనను స్వబుద్ధిచేత విచారింపక యేదోయొకగ్రంథమునం దున్నందున అనుసరింపవలసిన దని నమ్ముచున్నది. మీఁదుమిక్కిలి జిజ్ఞాసువులు, మతకర్తలు గూడ నీయభిప్రాయమునే గలిగియుండి రని నమ్ముచున్నది. అది సరి కాదు. పైవిషయమును గ్రహింపనేరనిజనసామాన్యముకొఱ కాజిజ్ఞాసువు లట్లు కనఁబడినను, నిజము విచారింపఁగా నాజిజ్ఞాసువులు తమమనస్సాక్షి కెక్కువప్రాముఖ్యము నిచ్చినట్లు కనఁబడును. అందువలననే మనుస్మృతియందు,

యత్కర్మ కుర్వతోస్యస్యాత్ పరితోషోన్తరాత్మనః
తత్ప్రయత్నేన కుర్వీత విపరీతన్తు వర్జయేత్

(అనగా నేకర్మమును జేయుటవలన, అంతరాత్మకు సంతోషమగునో, ఆకర్మము నతియత్నపూర్వకముగాఁ జేయవలయును. దానికి వ్యతిరేకమైనవానిని వర్జింపవలయును.)

అని చెప్పఁబడియున్నది. అంతమాత్రముచేత పైసహాయ మక్కఱలే దని చెప్పుటలేదు. సద్గురువులు, సద్గ్రంథములు మొదలుగాఁ గల పైసహాయము లావశ్యకములు. అట్టిసహాయము చేతనే మానవునియందు సహజముగా మఱుఁగుపడియున్న జ్ఞానశక్తి యుద్రేకింపఁబడి వ్యక్తము నొందును. అనగా మానవాత్మయందు వ్యాపించియున్న పరిపూర్ణుఁ డగు భగవంతునిసర్వజ్ఞత్వము పరిపూర్ణము కానిమానవాత్మమూలమున వ్యక్తమగును. దీని నే మానవుఁడు భగవంతుని దెలిసికొనుచున్నా డని చెప్పుదురు. అట్లు తెలిసికొనుటకు రెండుమార్గములు కలవు.

(1) పైనఁ జెప్పఁబడినట్లు గ్రంథాదులగుబహిఃకారణములచేతఁ దనలో నున్న శక్తి నుద్రేకింపఁజేయుటయు (Objective discipline)

(2) తాను మానసికముగా భగవంతుని ధ్యానించుటచేత ఆయనను తెలిసికొఁ గలుగుటయు (Subective discipline)

బ్రాహ్మమత మీరెండుమార్గములను బోధించుచున్నది. మొదటిమార్గము సర్వసాధారణముగా నాచరింపఁబడుటవలన విశేషించి చెప్పవలసినయావశ్యకత యుండదు. రెండవమార్గముగుఱించియే బ్రాహ్మమతము విశేషశ్రద్ధ తీసికొనుచున్నది. భగవంతుఁడు ఆత్మస్వరూపి యగుటచేత ఆయనను పొంద ననుకరించుమార్గములు ఆత్మసంబంధ మైన విగా నుండవలయును. అనగా మానసికసంబంధ మైనవిగా నుండవలెను. అది గాక ఆయనను మనయాత్మయందే కనవలయును. అందువలననే,

" ఆత్మానమేవ ప్రియ ముపాసీత " అని బృహదారణ్యకోపనిషత్తునందును,

" తమాత్మస్థం యేను పశ్యంతి ధీరాః తేషాం శాన్తి శ్శాశ్వతీ నేతరేషాం "

అని కఠోపనిషత్తునందును,

" సచక్షుషా గృహ్యతేనాపి వాచానాన్యైర్దేవై స్తపసా కర్మణావా జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వ స్తతస్తుతం పశ్యతే నిష్కలం ధ్యాయమానః "

అని ముండకోపనిషత్తునందును,

" మనసై వేదమాప్తవ్యం నేహానాస్తి కించన మృత్యోస్స మృత్యుం గచ్ఛతి యఇహానా నేవపశ్యతి " అని కఠోపనిషత్తునందును,

" అన్ధన్తమం ప్రవిశంతి యేసంభూతి ముపాసతే
తతోభూయ ఇవతే తమో యే సంభూత్యాగ్ం రతాః"

అని వాజసనేయోపనిషత్తునందును, స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది.

(అనగా ఆత్మస్వరూపుఁ డగుపరమాత్మను మాత్రమే ప్రేమతో నుపాసింతుఁడీ. ఎవరు తమ యాత్మలయందు భగవంతుని కనుఁగొనుచున్నారో, వారికే స్థిర మైనయాత్మ శాంతి కలదు; తదితరులకు కలుగదు. ఈశ్వరుఁడు నేత్రముచేత గాని వాక్కుచేత గాని యితరేంద్రియములచేతఁ గాని తపస్సుచేతఁ గాని కర్మముచేత గాని గ్రహింపఁబడఁడు; మనశ్శుద్ధి గలవాఁడు ధ్యానముచేసి యీశ్వరుఁడు ప్రసాదించినజ్ఞానముచేతనే యాతనిని దెలిసికొనును. మనస్సుచే మాత్రము బ్రహ్మము నందఁ దగును; అక్కడ ననేక మనునది లేదు; కాఁబట్టి యిక్కడ ననేకమునుగాఁ జూచువాఁడు మృత్యువునుండి మృత్యువునకుఁ బోవును. ప్రకృతి నుపాసించువా రంధకారమునఁ బ్రవేశింతురు; సృష్టిపదార్థముల నుపాసించువా రంతకంటెను హీనమైనయంధకారమునఁ బడుదురు. అని భావము.)

ఆయనను మానసికముగా నారాధించుటకు తగినపుష్పరాజములనుగుఱించి యీక్రింద నీవిధముగాఁ జెప్పఁబడియున్నది.

"అహింసా ప్రథమంపుష్పం పుష్ప మింద్రియనిగ్రహః
సర్వభూతదయాపుష్పం క్షమాపుష్పం విశేషతః
శాంతిపుష్పం తపఃపుష్పం ధ్యానంపుష్పం తథైవచ
సత్య మష్టవిధంపుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్"

ఈపైఁ జెప్పఁబడిన విధుల ననుసరించి భగవంతుని నుపాసించుటవలన మనము పాపమునకు దూరులమై సదా పావనత్వమునందే మెలఁగనగును. పాపమునుగుఱించి కలయుద్దేశములే పెక్కుమతములకు ప్రాముఖ్యము దెచ్చినవి. తద్బంధములనుండి విడివడుటకు సాధన మేమి? మనుస్మృతియందు చెప్పఁబడినట్లు,

కృత్వా పాపంహి సంతప్య తస్మాత్పాపాత్ ప్రముచ్యతే
నైవం కుర్యాం పునరితి నివృత్త్యా పూయతేపిసః

(పాపమును జేసి పశ్చాత్తాపము నొందుటచేత పాపమునుండి విముక్తులగుదురు. ఇట్టిది చేయ నని నివర్తి యగుటచేత వారు పవిత్రులగుదురు.) భగవంతుని నుపాసించుటకు దగినకాలము వేదాంతసూత్రమునందు జెప్పఁబడినట్లు "యత్రైకాగ్రతాతత్ర విశేషాత్" (ఎప్పుడు మనస్సు ఏకాగ్రము కాఁగలదో, అప్పుడే తగినసమయము.) జీవాత్మపరమాత్మలకు సంధి గలిగినసమయమునందు చేయువందనము సంధ్యావందన మని

చెప్పవచ్చును. ఇది బ్రాహ్మణు లని కాని, శూద్రు లని కాని, మ్లేచ్ఛు లని కాని భేదము లేక సర్వజనులును జేయవలసినది. భగవంతుఁడు సర్వమానవసముదాయంబునకు తండ్రివంటివాఁడు కావున నందఱును సోదరులుగాఁ గూడి ప్రార్థన సలుపఁదగును. అట్లు చేయుటవలన భగవంతునిపితృత్వమును, మానవునిసోదరత్వమును గ్రహించినవార మగుదుము. అట్లు గ్రహించినకొలఁదిని జీవితోద్దేశమును నెఱవేర్చినవార మగుదుము. ఈవిషయమునసే బ్రాహ్మమత మెక్కువగా బోధించుచున్నది. ఇట్టియుద్దేశమును నెఱవేర్చుకొన్న సంఘములు ప్రార్థనసమాజము లని పిలువఁబడుచున్నవి. ఇట్టిగొప్పపరమావధిని బోధించుచున్నమతప్రచారము ఏమతమునకు విరోధి కాఁజాలదు. అన్నిటికి నతీత మయినది. ప్రవేశపరీక్షయందు దేలినమానవునిస్థితికిని పట్టపరీక్షయం దారి తేరిన వానిస్థితికిని భేద మున్నను విరోధము లేక రెండవవానిస్థితి మొదటివానిస్థితిని గలుపుకొని దాని కతీతమై యుండునట్లు, బ్రాహ్మమతపరమావధి సర్వమతసారమై వాని కతీతమై యున్నది. అందువలన బ్రాహ్మమతమునకు నితరమతములయెడల ద్వేష ముండుట కవకాశ ముండదు. అది యన్నిటిని సమన్వయించి లోకమున నెమ్మదిని సర్వసౌభ్రాతృత్వమును నెలకొల్పవలె నని ప్రయత్నించుచున్నది. అట్టిప్రయత్నమునకు మనుజనివృత్తు లగు ఆధ్యాత్మిక, రాజకీయ, సాంఘిక, నైతిక, ఆర్థిక, పరిశ్రామికాదులయభివృద్ధి యావశ్యకము. అందువలననే పైవిషయములయభివృద్ధిసూచకము లగుసకలవిధసంస్కారణములకు బ్రాహ్మమతబోధకులే ముందంజ వేయుచున్నారు.

## ఆ జ న ప్రి క ర ణ ము.

### బ్రాహ్మమతముయొక్క నూతనత్వము.

పైని చెప్పఁబడినవిషయములను బరిశీలించి చూడఁగా బ్రాహ్మమతము పురాతన నూతనమతమిళితముగాఁ గనబడును. అది స్వాభావికము. సనాతన మైనంతవఱకు పురాణమును, ప్రస్తుతస్థితిగతుల ననుసరించి నూతనము నయి యున్నది. ఈనూతనత్వమే దీనికి ప్రాముఖ్యము దెచ్చినది. ఈవఱకు మనదేశమున నేమి, మఱి యితరదేశముల నేమి మతమునకు నితరవిషయములకు భేదము గల్పించి మత మనునది కొందఱికిని, కొన్నివేళల యందును మాత్రమే అనుసరణీయ మగునట్లు చేసిరి. బ్రాహ్మమతము బోధించునూతన సందేశ మే మనగా, మనము చేయుప్రతికార్యమును మతము ననుసరించి యుండవలయు ననియు, రాజకీయ, సాంఘిక, నైతిక, ఆర్థిక, పరిశ్రమి కాదు లగు సకల వ్యాపారములకు మతమే యాధార మనియు. ఇది కొందఱి కాశ్చర్యముగాఁ దోచును. అట్టియాశ్చర్యమునకుఁ గారణ మంతయు మతముయొక్కయర్థములో నున్నది. మత మనగా, సర్వమానవసృష్టికర్త యగుభగవంతునిపితృత్వమునందును, సర్వజనసౌభ్రాతృత్వమునందును, సర్వమానవశ్రేయోభివృద్ధిపరిశ్రమమునందును నమ్మికయే. అట్టియభివృద్ధి ఆధ్యాత్మిక, రాజకీయ, సాంఘిక, నైతిక, ఆర్థిక, పరిశ్రమి కాదివిషయములను సంబంధించినది. మనము చేయుప్రతికార్యమును పైవిషయములతో సంబంధము గలిగియుండుట చేత మతసంబంధములే యని చెప్పవచ్చును. కావుననే బ్రాహ్మనిత్యుదయకాల వందన మీరీతిగా నుండును.

శ్లో॥ లోకేశ చైతన్యమయాధిదేవ। మాంగల్యవిష్ణో భవదాజ్ఞయైవ।
హితాయ లోకస్య తవప్రియార్థం। సంసారయాత్రా మనువర్తయిష్యే॥

(అనగా మనము చేయుసర్వకార్యములును భగవత్ప్రీత్యర్థముగాఁ జేయుచుండవలెను.) ఈవిషయము కూడ హిందూమతమునకు నూతనము గా దని చెప్పవచ్చును. అయినను కాలక్రమమున నీవిషయము మఱచి మత మనగా నేదో భిన్నమయిన దనియు, ఏవో కొన్నికర్మముల నాచరించుటయే యనియు, లేక సంసారబంధములను వదలి ప్రాపంచికవృత్తుల ద్యజించి యేదోయొకకాలమున ననుసరించఁదగిన దనియు దలఁచియున్నారు. ఇట్టియూహయే మనప్రస్తుతపుసర్వవిధములహీనదశకుఁ గారణ మని నా కొక్క

చెప్పుచున్నను. కావున నిట్టియూహను బోఁగొట్టి సంసారబంధములు ప్రాపంచిక వృత్తులు త్యజింపఁదగినవి గావనియు, వానిని భగవత్ప్రీత్యర్థముగా నిర్వహించుచుండవలయు ననియు, బోధించవలసినయావశ్యకత వచ్చినది. ఇదియే భగవద్గీత బోధించినబోధ. ఇట్టిబోధను పెక్కుండ్రు మఱచిపోయిరి. కొందఱికి జ్ఞాపక మున్నను అట్టిబోధనలు పుస్తకములందును, ఉపన్యాసములందునే కానుపించును. బ్రాహ్మమత నూతనబోధ యంతయు నొక్కమాటలోఁ జెప్పుచున్నను. అది యుత్తమబోధనలను మనము నేర్చుకొనుట మాత్రమే కాక వీలైనంతవఱకు కనుష్ఠానమునం దుంచవలెనని బలవంతపెట్టుచున్నది. ఇదియే బ్రాహ్మమతముయొక్కనూతనబోధ.

మనుజునిజీవితోద్దేశమును నిర్ధారణ చేయఁ దలచి జిజ్ఞాసువులు మనుజునియందు త్రివిధము లైనశక్తుల గనుఁగొనిరి. అవి వివేకము (Intellect) ప్రేమ (Emotion) మనస్థైర్యము (Concionce or will). ప్రపంచమున వీనివ్యాపకములే సర్వమానవశ్రేయోభివృద్ధిసాధకము లగు ఆధ్యాత్మిక, రాజకీయ, సాంఘిక, నైతిక, ఆర్థిక, పరిశ్రామిక, ప్రకృతిశాస్త్రజ్ఞానాదు లగుసమస్తవృత్తులకుఁ గారణము లైనవి. ఈమూఁడుశక్తుల నుపయోగపఱచుటకు మూఁడుమార్గముల నేర్పఱచిరి. అవి జ్ఞాన, భక్తి, వైరాగ్యము లనునవి. ఈశక్తుల నీమార్గముల ననుసరించి సర్వవిషయములందు నుపయోగించవలెను. అనగా ప్రతివిషయమునుగుఱించియు, వివేకశక్తిచేత దానితత్త్వమును గ్రహించి, సత్యాసత్యములను, కీడుమేళ్ళను, లాభాలాభములను విచారించి, ప్రేమశక్తిచేత దానియందు భక్తి నుంచి, మనస్థైర్యశక్తిచే నావిషయమునందు గట్టిపట్టుదల గలిగి భగవత్ప్రీత్యర్థముగా దానిని నిర్వహించుచు, ఫలమునందును, తదితరవిషయములందును వైరాగ్యబుద్ధి గలిగి యుండవలయును. ఎప్పుడును జ్ఞానముచేత తత్త్వమును గ్రహించి భక్తిచేత దానియందు ప్రేమ జూపుటవలన నొకవిషయమునం దాసక్తి యెక్కువయై సహజముగా నితరవిషయములందు వైరాగ్యము కలుగుచున్నది. ఇటువలెనే యాధ్యాత్మిక విషయములను గ్రహించుటకును ఈమూఁడుశక్తులకును మూఁడువిధము లైనమార్గముల నేర్పాటు చేసి వానికి వరుసగా జ్ఞాన, భక్తి, యోగమార్గము లని పేరుపెట్టిరి. ప్రతిమానవునియందును ఈమూఁడుశక్తు లున్నందున పైమార్గములమూలకముగా వానియభివృద్ధియే జీవితోద్దేశ మని జిజ్ఞాసువులు గ్రహించిరి. అందువలననే,

"జ్ఞానవైరాగ్యయుక్తేన భక్తియోగేన యోగినః
క్షేమాయ పాదమూలం మే ప్రవిశంత్య కుతోభయం"

అని భాగవతమునందు జెప్పఁబడినది. కాని కాలక్రమమున కొందఱు లోకానేక మార్గము ననుసరించి ఒక్కశక్తికే యభివృద్ధి నొందించుకొనుటయు తక్కినశక్తులను నిగ్రహము చేయుటయు తటస్థించినందున నొకమనుజుని యవయవములలో నొకటి పెరిగి తక్కినవి నీరసించుచు వచ్చినయెడల శరీరము నెట్లస్వాభావికమును వ్యాధిగ్రస్తము నని తెలియునో, అట్లే ఏకశక్త్యభివృద్ధియు నిజమయినయభివృద్ధికి సూచకము గాదు. అందువలననే జ్ఞానశక్తి నభివృద్ధి నొందించుకొను వేదాంతుల వాదములతోడను, శాస్త్రచర్యలతోడను, కాలము గడపుచు నిశ్చలమైన భక్తి గాని, భగవంతుని ధ్యానరూపమున దర్శించుటకు సాధన మగు వైరాగ్యయుక్తమయినమనస్థైర్యము గాని లేకుండుటయు, ఒక్కభక్తిని బెంపొందించువారు మిగులమూఢులై భగవంతునిగుఱించినసత్యతత్త్వమును గ్రహించనేరక, నీతిమార్గమున తగినంతలక్ష్యముంచక, వైరాగ్యయుక్తమయినమనస్థైర్యము లేకయుండుటయు, ఒక్కయోగమార్గము నవలంబించువారు ఈచరాచరాత్మకంబగుసృష్టియందు భగవంతుని గ్రహించనేరక ప్రపంచమును, మానవబృందమును త్యజించి స్వార్థపరాయణులభంగి కాలము గడపుచుండుటయు గలుగుచున్నది. కాని ఈమూఁడుశక్తులను సమన్వయించుచు న్యాయానుసరణముగ వాని నభివృద్ధి నొందించుకొనుటయే నిజమగుజీవితోద్దేశము. ఈసందేశమును నూతనముగా తిరిగి బోధించుటవలన బ్రాహ్మమతబోధన నూతన మయినది.

పైఁ జెప్పినయాదర్శములు హిందూమతమందలి యున్నతబోధన లని యొప్పుకొని, వాని ననుసరించవలసినది తురీయచతుర్థాశ్రమము లగువానప్రస్థ సన్యాసాశ్రమములందుఁ గాని, మొదటి రెండుఆశ్రమము లగు బ్రహ్మచర్య గృహస్థాశ్రమములయందు గా దని కొందఱు శంకింపవచ్చును. అట్టివారిమత మనుసరించి ప్రతిమనుజుఁడును తనజీవిద్దేశమును పూర్తిగా నెరవేర్చుటకు గాను ఏర్పడినపైబోధనల నన్నిటి ననుసరించుటకు తప్పక తనజీవితకాలమున కడపటిరెండాశ్రమములయందును గూడ జేరవలసియున్నది. లేకున్న వారిజీవితము నిష్ఫల మగుచున్నది. కాని ప్రస్తుతమున నటులఁ జేయువారు లే రనియే చెప్పవచ్చును. కావుననే చాలమందిజనులు గొప్పగొప్పశాస్త్రపండితులు సహితము మొదటిరెండాశ్రమములయందే తమజీవితకాల మంతయు జరపి, మతగ్రంథములయందు జేర్కొనబడిన యున్నతాదర్శములను పనికిమాలినవానిగా జేసి, తాము నిరంతరము అథోగతిపాలగుచున్నారు. దీనికి కారణము లేకపోలేదు. కలియుగమునందు, సంఘాభివృద్ధికి సంబంధము లేక, అడవులపాలు జేసెడివానప్రస్థసన్యాసాశ్రమములు నిషేధింపబడినట్లు కొన్నిగ్రంథములవలన గానఁబడును. అంతమాత్రముచేత తత్తద్ధర్మములను గూడ వర్జించినచో, ఉన్నతాదర్శములు, మోక్షదాయకములు నగుసర్వసమత్వబుద్ధి, బ్రహ్మ

జ్ఞానసంపాదనాసక్తి, వైరాగ్యబుద్ధి, సర్వకార్యనిర్వహణమునందు నిరంతరభగవతారాధనాబుద్ధి లోనగువాని ననుసరించు టెప్పుడు? అట్లనుసరించనిచో మోక్షము చేకూరు టెట్లు? జీవితము నిష్ఫలము కాదా? కావున పైఁజెప్పిన ఉన్నతాదర్శములను గూడ తగిన మార్పులతో మనవా రందఱప్పు డనుసరించుచున్న మొదటిరెండాశ్రమములయందే గ్రహించి తదనుసారముగా నడువఁ బ్రయత్నింపవలయును. ఇట్టిసందేశమును బోధించుటవలనఁ గూడ బ్రాహ్మమతబోధ నూతనమైనది.

బ్రాహ్మమతమును బోధించు ముఖ్యసిద్ధాంతములు మూడు. 1. భగవంతుఁడు ఆత్మస్వరూపుఁడు. 2. ఆయనను బొందఁగోరు ఉపాసన ఆత్మసంబంధ మయినదిగా నుండవలయును. 3 ఆయనచే సృజింపఁబడినసకలమానవబృందము సోదరతుల్యము. ఈసిద్ధాంతములు ఆచరణలోనికిఁ దెచ్చుమార్గములను వారివారిశక్తికి విడుచుచున్నది. కాని ఈసిద్ధాంతములను మఱువవల దని పలుమఱు జ్ఞాపకపఱచుచున్నది. వీనియందు మనస్సును లగ్నపఱచువారు సాధారణముగా నెన్నికష్టములు వచ్చినను వెనుదీయక వీనిని స్వానుచరణమునం దుపయోగించుచున్నారు. నిజము విచారింపగా నీపైసిద్ధాంతములే మనప్రాపంచికపుసాంఘికాదు లగువృత్తులకు మూలబీజము లగుటచేత వానిని స్వానుచరణమునం దుపయోగించువారిసాంఘికాదివృత్తులు జనసామాన్యముయొక్క వృత్తులకన్న భిన్నముగా కనఁబడకమానవు. అందువలన వారు మతాంతరు లని చెప్పఁగూడదు. బ్రాహ్మమతము హిందూ మహమ్మదీయ క్రైస్తవమతములవంటిప్రత్యేకమతము కాదు. అది సర్వజనసామాన్యమైనసనాతనధర్మములను బోధించుచు అట్టిబోధనలను స్వానుచరణమునందు పరిణామము నొందునట్లు చేయుమనుచున్నది. ఇదియే బ్రాహ్మమతనూతన బోధ. ఇట్టిబ్రాహ్మమతాంతర్గతసార మీక్రిందిశ్లోకమువలనఁ దెలియఁబడఁగలదు.

శ్లో॥ సువిశాల మిదంవిశ్వం పవిత్రం బ్రహ్మమందిరం
చేతస్సు నిర్మలంతీర్థం సత్యంశాస్త్ర మనశ్వరం
విశ్వాసో ధర్మమూలంహి ప్రీతిః పరమసాధనం
స్వార్థనాశస్తు వైరాగ్యం బ్రాహ్మైరేవం ప్రకీర్త్యతే॥

మిక్కిలి విశాలమయినయీప్రపంచము బ్రహ్మముయొక్క పరిశుద్ధమైనఆలయము. చిత్తము నిర్మల మైనయుదకము. సత్యము నశించనిశాస్త్రము. నమ్మకము ధర్మమునకు కారణము. ప్రేమ శ్రేష్ఠ మైనయుపకరణము. తనసంబంధ మైన దనెడియభిప్రాయము యొక్క నాశమే వైరాగ్యము. ఇట్లు బ్రహ్మసంబంధు లగువారిచేఁ జెప్పఁబడుచున్నది.

ఓం శాంతిః శాంతిః శాంతిః

# స్వతంత్రమగు నాంధ్రసాహిత్యము,

## దాని నభివృద్ధి నొందించుమార్గము.

దేశ మభివృద్ధి కావలె ననిన దేశభాష యభివృద్ధి కావలయును. భాషాభివృద్ధి గ్రంథసామగ్రి యుండినఁ గాని కానేరదు. మనభాషయందుఁ బూర్వ మెప్పుడో వ్రాసిన కొన్ని పద్యకావ్యములు వినా జ్ఞానాభివృద్ధిసాధనమునకు గ్రంథములు గానరావు. అన్నిటికిని భారతభాగవతరామాయణములే శరణ్యములు. మనవా రిప్పుడు దేశభాష యభివృద్ధి జేయఁ దలంచి గ్రంథములు వ్రాయఁ గడంగుచున్నారు. గ్రంథరచనకు ముందు మంచిసాహిత్య ముండవలయును.

ఇప్పుడు మనభాషయందు సాహిత్యవేత్తలు రెండుతెగలవా రున్నారు. ఒకరు సంస్కృతము నేర్చి తెలుఁగు చదివినవారు. రెండవవారు ఆంగ్లేయవిద్య నభ్యసించి పిమ్మట తెలుఁగునకు దిగినవారు. మొదటివారికి విమర్శనాజ్ఞానము, ప్రపంచవాసనయు తక్కువగ నున్నది. రెండవవారికి భాషాజ్ఞానము శూన్యముగ నున్నది. ఉభయ ముండినఁ గాని భాషాగ్రంథములు మంచివి బయలుదేఱవు. ఒకరు—సర్వమును సంస్కృతముననే యున్నది; మన మింక వేఱుగఁ జేయవలసినది యేమియును లే దనియు, దానిని తెలుగు విఱిచి మార్చినమాత్రమున భాషకు వృద్ధియగు ననియు ననుచున్నారు. వేఱొకరు—సర్వమును దమమేధావిశేషముననె నిర్మింపఁగల మనియు, ఊహ యుండిన శబ్దము తనంతన తానే బయలుదేఱు ననియు, శబ్దమునకు సౌందర్య మేల, ఊహ తెలిసిన చాలదా యనియు ననుచున్నారు. ఈరెండును గూడ భాషాభివృద్ధికి మంచిసాధనములు గాకున్నవి.

సాహిత్యము లేనిగ్రంథరచన పునాది లేనిగోడవంటిది. సాహిత్యశబ్దమున కవయవార్థము యోచించి చూచినచో సర్వవిద్యాసహితత్వ మని యర్థముఁ జెప్పవలయును. కేవలశాస్త్రజ్ఞానము గాని కేవలార్థజ్ఞానము గాని, సాహిత్యము గాదు. ఉభయజ్ఞానసమ్మేళనముఁ గలిగినయాతఁడే సాహిత్యవేత్త యగును. మన మెందఱినో

వైయాకరణులను, మీమాంసికులను, వేదాంతశాస్త్రజ్ఞులను జూచుచున్నాము. వారెవ్వరికిఁ గాని భాషావిషయమున సామాన్యజ్ఞాన మున్నట్లయినఁ గనుపట్టుటలేదు. శబ్దశాస్త్రము గాని, మీమాంసశాస్త్రము గాని, అలంకారశాస్త్రము గాని పుట్టినది భాషాజ్ఞాన మభివృద్ధి యై సరస మైనయర్థజ్ఞానమును, సౌష్ఠవ మైన గ్రంథరచనయును గలుగుటకొఱకు. శబ్దశాస్త్రము తప్పులు లేకుండ శబ్దములు ప్రయోగించుటకును, మీమాంసశాస్త్రము హేతుయుక్తముగ గ్రంథరచనయు అర్థరచనయు చేయుటకును, అలంకారశాస్త్రము వీనికి వన్నె పెట్టుటకును నేర్పడినవి. ఇవి యన్నియును సాహిత్యమునకుఁ బరికరములు. ఇన్నియయు నుండినను వానికి బుద్ధిపాటవము గూడ మంచిది కలిగినఁ గాని యుత్తమగ్రంథముల నర్థము జేసికొని యందలిస్వారస్యమును గ్రహించుటకు శక్తి యుండదు. 'నీటికొలఁది తామర సుమ్మీ' యని చెప్పినసూరనార్యుని వాక్యానుసరణముగ వయినఁ జెప్పినయుపకరణము లన్నియు నుండిన నుత్తమకావ్యములందలి జ్ఞానరసమును జేదికొనఁగలుగును. వాల్మీకివిరచిత మగు శ్రీమద్రామాయణమును బిన్నలు మొదలు పెద్దలవఱకు నందఱును పారాయణము జేయుచునే యుందురు. అం దందఱకును గొలఁదిగనో గొప్పగనో యానందము కలుగుచునే యున్నది. ఒకరి కొకయంశము తెలియును. ఇంకొకరి కింకొకయంశము తెలియును. ప్రపంచమునందలి రహస్యము లన్నియును మనుజున కెట్లు దురవగాహములో యట్లే యీకావ్యప్రపంచమునందలిస్వారస్యరహస్యములును దురవగాహములు. అన్నియును దెలియుట యొకనితరము గాదు. అయినను వానినిఁ దెలిసికొనఁ బ్రయత్నముఁ జేయుట మనుజులకు విధాయకకృత్యము. 'ఊహ తెలియం గలలేఖకపాఠకోత్తముల్ దొరకినఁ గాక యూరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే?' యను పెద్దనార్యునిపల్కు గణన కెక్కవలెనన్నచో కావ్యరసమును గ్రహింపఁ గలపాఠకు లుండినగాని గ్రంథములు రచించి ప్రయోజనము లేదు. పాఠకులు సరసత గ్రహించువార లున్నపుడు గ్రంథములు మంచివి బయలుదేరినఁ గాని వాని ముట్టఁబోరు.

ఆంగ్లేయవిద్యావ్యాపకత్వమున మనభాషయందు చాలమందికి విమర్శనజ్ఞానమును, గ్రంథపఠనాభిలాషయును వృద్ధి యైనవి. విద్యాధికులలో చాలమంది మొన్నటివఱకును

దేశభాషలజోలికి పోయినవారలు లేరు. కాని యిప్పుడిప్పుడు జాత్యభ్యుదయము ప్రారంభ మైనవెనుక కన్నులు దెఱచుచున్నారు. తమభాషయం దున్నగ్రంథముల నొక్కసారి చూచి యానందింపవలె నన్న కోరిక కొందఱికి బొడముచున్నది. ఆమనో రథము కొనసాగించుకొనవలె నన్నవారికి తగినగ్రంథములు దొరకుటలేదు. అంత వారు తమభాషయొక్క పేదఱికమును జూచి యితరభాషలయందువలె తమభాషయందును విద్యాజ్ఞానము ప్రబలవలయు ననునభిలాషతో గ్రంథరచన కుపక్రమించుచున్నారు. వారంతకుపూర్వ ముగ్గుపాలతో నభ్యసించినది యాంగ్లేయవిద్య యగుటచే దేశభాష యందు వాక్యరచన గాని అందలిశబ్దజాలము గాని వారికి గోచరించుట మానినది. ఊహ, పచ్చినాఁటనుండియును నన్యభాషాసంపర్కమే విశేష మగుటచే వారికి మనసునఁ బొడముచున్నయూహ లన్నియు నాభాషయందే యంకురింప మొదలిడుచున్నవి. అందుమూలమున వారు వ్రాయుగ్రంథములు స్వతంత్రముగ వ్రాయునవి యైనను వ్రాసినవాక్యము లన్నియును లోపలఁ బుట్టినయూహలభాషాంతరీకరణములే యగుటచే గ్రంథములు ధారాళ మగుశైలితో నుండుట లేదు. అన్యభాషాసంపర్కము లేక ప్రత్యేకముగ నీగ్రంథములే చదువుకొనెడివారి కవి సుబోధములుగ నుండుటలేదు. దేశభాషాసంపర్కము వీరికి తక్కువ యగుటచే విషయమునకు తగినమాటలు వీ రుపయోగింపఁ జాలకున్నారు. ఆంగ్లేయభాషలోనిమాటలు సాదుచేసి వానినే వాడుచున్నారు. ఆమాటలు అనుదినవ్యవహారములోనివి యయిన పాఠకుల కవి కొంచె మర్థము కావచ్చును. కాని అట్టివానికి మాత్రమే వారు అన్యభాషాపదము లుపయోగించుటలేదు. లోపలఁ బుట్టినయూహకు సరియైనపదము స్ఫురింపనప్పు డెల్ల అన్యభాషా పదమునే ప్రయోగించుచున్నారు. ఒకరు అద్దపుచట్రమునకు 'ఫ్రేము' అనియును, లెక్కలపుస్తకమును 'అర్థమెటిక్కు' అనియును వ్రాసిరి. ఈఫ్రేము అనునది వాడుకలోని పదమా? అది యర్థ మగుట యెట్లు? 'అర్థమిటిక్కు' అనునది మాత్రము అందఱకు తెలిసినమాటయా! ఇట్టిభాషతో ప్రకృతిశాస్త్రగ్రంథములు మున్నగునవి తెలుగున రచింపఁ బడుచున్నవి. ఆగ్రంథములయం దెంతసార మున్నను అట్టివి జనాదరణీయములై దేశమునకు పలయుపయోగము వానివలన కలుగు నని చెప్పుటకు వలనుపడదు. గ్రంథములు సర్వ జనాదరణీయములు కావలసినచో, నిర్దుష్ట మైనశైలి యవలంబించుకొని ధారాళముగ

గ్రంథములు వ్రాయవలయును. వ్రాసినవారి గ్రంథములు వ్రాసినవారికే యర్థము గావు. ఇంక పైవారిమాట యేల? వీరు విద్యావంతులే యగుదురు. వీరికి చక్కనిశాస్త్రజ్ఞానమును కలదు. కాని దేశీయులకు వీరిపాటువకుఁ దగినంత, వీరివలన కలుగవలసినంత లాభము కలుగుట లేదు. దీనికంతకును కారణము వీరికి సాహిత్యమునందు గట్టిపునాది లేకపోవుటయే.

ఆంధ్రభాష విశేషముగ అన్యభాషాపదములతోఁ జేరినది. దేశ్యపదములు పాతిక పాలు కూడ లేవు. సంస్కృతభాష ఆర్యభాష యగుటచేతను, ఆర్యు లాంధ్రులతో భాష యుత్పత్తియైననాటనుండియును గలసిమెలసి యుండుటచేతను, సంస్కృతశబ్దములు కొన్ని వికృతిని పొందియు, కొన్ని మూలపదములే రూపము చెడక నిలిచియు, వ్యవహారయోగ్యము లయినవి. ఇప్పుడీసంస్కృతసమములే తెలుఁగుభాషయందు సగపాలునకు మించియున్నవి. మనకు లక్షణగ్రంథములును, శబ్దశాస్త్రమును, ఛందశ్శాస్త్రమును మున్నగునవి యెల్ల సంస్కృతమునుండియే గైకొనఁబడినవి. ఆంధ్రవ్యాకరణము కూడ సంస్కృతమునందే వ్రాయఁబడినది. మన కాదివ్యాకరణములు నన్నయభట్టీయము. అథర్వణకారికలు గదా! అవి సంస్కృతమునం దున్నవి. అవి యన్నియును నేర్చుకొనినఁ గాని ఆంధ్రభాషకు శబ్దసౌష్ఠవమే లేదు. వాక్యరచన యంతయును తెలుఁగులోనిది సంస్కృతము ననుకరించియే యుండును. అందుమూలమున ఆంధ్రసాహిత్యము వృద్ధి కావలయు నన్న సంస్కృతమునందు పునాది యేర్పడి తీరవలయును. సంస్కృతవ్యాకరణమును, అలంకారశాస్త్రమును వచ్చినఁ గాని తెలుఁగున కలము కదుపుటకే వలనుపడదు. సంస్కృతసాహిత్యము గలపండితులకు తెనుఁగున గ్రంథరచనము సుకరము. అంపలిసాహిత్యము కలవారలకు ఇందు కొలఁదికృషి జరిగిన తెలుఁగున గట్టి సాహిత్యము కుదురును. కేవలసంస్కృతపండితులకు కృషి చేయక తెలుఁగు పట్టుపడదు. కొన్నియెడల సంస్కృతమునకు విలక్షణము లైనయంశములు గొన్ని తెలుఁగున నున్నవి. ఇది కూడ కొంతకాలము శ్రద్ధతోఁ గృషి చేసినఁ గాని గట్టిసాహిత్యము పట్టువడదు. తెనుఁగుపద్య మిచ్చిన నర్థముఁ జెప్పలేనిసంస్కృతసాహిత్యవేత్తల మన మెందఱినిఁ జూచుటలేదు. ఇప్పుడు సంస్కృతసాహిత్యవేత్తలకు విమర్శనజ్ఞానము నశించినది. ఉభయసాహిత్యములుగలవారిలోఁ జాలమంది సంస్కృతభాషావేత్తలు మాత్రమే

కనుపట్టుచున్నారు. వారే తెలుఁగుగ్రంథములు వ్రాయువారై యున్నారు. వీరికి భాషాస్వామ్య మున్నది గాని తగినంత లోకవిజ్ఞానము వీరికడ నున్న యగుచున్నది. ఆంగ్లేయభాషయం దిప్పుడు విశేషముగ శాస్త్రజ్ఞానము లభించుటకు సాధనము లున్నవి. ఆశాస్త్రజ్ఞాన మంతయును లభించినఁ గాని కొంతకాలమువఱకును తెలుఁగున స్వతంత్రముగ మంచిజ్ఞాన మలవరించుకొనుటకు సాధనము లేదు. దేశభాషయందు గ్రంథములు రచింపఁబూను ఆంగ్లేయభాషావేత్త లందఱును తెలుఁగునందు సాహిత్య మలవరించుటకై సంస్కృతవిద్యాభ్యాసము చేయవలయును లేకున్న శబ్దసౌష్ఠవము, నూతనశబ్దకల్పన లభింపదు. విశేషణమును విశేష్యము చేయవలయు నన్నను, ధాతువునుండి కృదంతములఁ గల్పింపఁ బూనినను వారికి సాధ్యము గాదు. యత్నించినను అది తప్పు లేకుండ నుండదు. సంశయము నశింపదు. ఇప్పుడు క్రొత్తగ్రంథములు వ్రాయువా రందఱు ఆంగ్లేయభాషాజ్ఞానము గాని, సంస్కృతభాషాజ్ఞానము గాని లేకయే గ్రంథములను రచించువారలుగ నున్నారు. ఇప్పుడు రచియింపఁబడుగ్రంథము లన్నియు అంతరనామవలె నున్నవి. ఒకగాలి విసరిన పేరు లేకుండ పోవును. వీరుభయులును గూడ ఆంగ్లేయసంస్కృతాంధ్రములయందు మూఁడింటనుగూడ మంచిపరిచయము గలిగించుకొనినఁ గాని భాషాభివృద్ధికై వీరు చేయుకృషి కొనసాగదు. ఇంతవఱకు నేను చెప్పినది ఆంధ్రమున సాహిత్య మలవరించుకొనుటకు మార్గములు.

ఇంక నందు స్వతంత్రముగ సాహిత్యము సంపాదించుమార్గములఁ జూడవలయును. ఇప్పు డాంగ్లేయవిద్యలయందుఁ గృషి చేసినతరువాత గాని దేశవిద్య మెఱుఁగము జూచుట లేదు. వీ రెంత కష్టించినను వీరికి స్వతంత్రసాహిత్యము గలుగుట దుర్లభము. స్వతంత్రసాహిత్యమునకు మనసునఁ బుట్టునూహలన్నియును నేభాషయందు మనము వానిని వ్రాయ దలంతుమో అందే స్వతస్సిద్ధముగ పుట్టవలయును. ఈస్వతంత్రజ్ఞానము గలుగుటకుముందు దేశభాషయందును సంస్కృతభాషయందును విద్యాభ్యాసము జరిగి అందు గట్టిపునాది కుదురవలయును. శాస్త్రాధ్యయన మంతయును తెలుఁగుభాషయందే జరుగవలయును. ఇంగ్లీషునందుఁ గలప్రకృతిశాస్త్రము లన్నియును తెలుఁగున బోధింపఁబడవలయును. సంస్కృతశాస్త్రములలోనిపూర్వపక్షసిద్ధాంతము లన్నియును సూత్ర

ములు మాత్రము వల్లింపఁజేసి దానిమీఁదనే తెనుఁగున మనస్సున కెక్కులాగు బోధింప వలయును. ఆంగ్లేయ దేశమున ఆభాషాశబ్దములవ్యుత్పత్తి మొదలగువానిని నరయుటకును, పూర్వగ్రంథముల పుట్టుపూర్వోత్తరముల నరయుటకును, ఆభాషను తెలిసికొనుటకును లాటిన్, గ్రీకు మొదలగు భాషలను చదువుకొనులాగున సంస్కృతమునందును, ఆంగ్లేయ భాషయందును చక్కనిభాషాజ్ఞానము కలుగుటకు తగినపాఠములను గఱపినవారు స్వతంత్ర సాహిత్యము నలవరించుకొని రవీంద్రనాథ్ టాగూరు వంటిమహావేత్తలును, మహాకవులును పండితులును, సాహిత్యవేత్తలును బయలుదేఱఁ గలరు. ఈవిద్యాభ్యాసమునకు ప్రత్యేకకళాశాలలు బయలుదేఱవలెను. ఇప్పుడున్నవానిలో 'స్కూలుఫైనలు' పరీక్ష అయినవెనుక కళాశాలలోఁ జేరునప్పుడు భాషావిషయములు మాత్రము స్వీకరించి చదువు కొనుటకు తగుమార్గ మున్నది గాని అది స్వతంత్రసాహిత్యమును వృద్ధిఁ జేయనేరదు. ఆంగ్లేయభాష మొదటినుండియును ప్రధానభాషగ బోధింపఁబడుటచే వారికి చిన్నప్పటి నుండియు మనస్సును, ఊహలు వృద్ధిఁబొందుమార్గము నీవైపునకు మరలనేరదు.

సంస్కృతవిద్యాభివృద్ధికై క్రొత్తగ దొరతనమువా రేర్పఱచినపథక మున్నది. దానిని కొంచెము మార్పు చేసి తెలుఁగుపద్యకావ్యపఠనమును, వ్యాకరణపఠనమును, ప్రకృతిశాస్త్రపఠనమును ఇందుఁ జేర్చిన అది సుకరముగ, స్వతంత్రముగ తెలుఁగుసాహిత్యము పట్టుపడుటకు కొంతయాధార మలవడును గాని అందిప్పుడు చెప్పఁబడుపాఠక్రమ మనుసరించి విద్యాభ్యాసము జరుగవలసివచ్చినచో, ఇంగ్లీషుపాఠశాలలయందు ఇంగ్లీషే ప్రధానవిద్యగ పట్టుపడునట్లు ఇందు సంస్కృతమే ప్రధానవిద్యగఁ బట్టుపడును. తెలుఁగునందుఁ బరిచయము కలుగును గాని అందు సాహిత్యవేత్తల కుండవలసినంతజ్ఞాన ముండదు. అందు తెలుఁగుగ్రంథముల కెక్కువ తావిచ్చి సంస్కృతవ్యాకరణమును, శక్తివశాస్త్రగ్రంథములును, సాహిత్యసామగ్రియు తెలుగుననే బోధించినచో భాషాభ్యాసమునకై మేధాశక్తి విశేషముగ వెచ్చబడక జ్ఞానసంపాదనకై వినియోగపడి స్వతంత్రమగు తెలుఁగుసాహిత్య మొక్కతరమునాటికి బయలుదేఱఁగలదు. అందులకై తెలుఁగుదేశమునందలిప్రముఖులందఱును తగినకృషి చేసి తెనుఁగుదేశమునందు తగినవిద్యాశాలలు స్థాపింప యత్నించెదరు గాక.

# ప్రకటన.

# సాహసిక రాజపుత్రిము.

**వెల రు 0-6-0 లు.**

ఇది యొక చరిత్ర విషయిక నాటకము. కప్పము గొనుటకు ఉదయపుర రాణా యగు జగమల్లమహారాజు మీఁది కక్బరు దండెత్తి వచ్చిన కథ యిందుఁ జక్కఁగ వర్ణింపఁ బడినది. ఉదయపుర క్షత్రియుల శౌర్య సాహసములు సర్వజన విదితములు. బ్రతికి యున్నంత వఱకు రాణాయును దరువాత రాణీ రామాబాయియుఁ జూపిన శౌర్య సాహస స్వదేశాభిమానము లాశ్చర్య జనకములు. యుద్ధము సేయ రమ్మని యక్బరుని బిలిచి నపుడు రామాబాయి చేసిన ప్రసంగము సునీతిరవలయును. ప్రతి పద్యమును వీర రస పరిపూర్ణమై ఒయ్యారి నడకలతో సొంపు గులుకు చుండును.

శైలిఁ జూపుటకు కొన్ని పద్యములు ప్రదర్శింపఁ బడు చున్నవి.

సీ. అవిలంఘ్యమైన మతాచారమునకు జుట్టుంచుకొన్నను గప్ప మొసఁగ వలయు
నాజాతి యీజాతి యనక గో మత్స్యాది పలల మెల్లను భుజింపఁగ వలయును
నెంత గౌరవమున్న హిందువైన గులామునకును వంగి సలా మనంగ వలయు
విగ్రహారాధన విడిచి మసీదులఁ దిరిగి యల్లాను బ్రార్థింప వలయు
గీ. వైభవము మీఱఁగా నుత్సవములఁ జేసికొనవలను గాదు, కృషి సేసికొని సుఖమ్ము
వొందఁగా రాదు, యవన ప్రభుత్వమందు హిందువులు గాంచు సౌఖ్యమ్ము లివియసుమ్ము.
గీ. బ్రతికి యున్నంత వఱకును రాజపుత్రు లహిత నృపులకు సామంతు లగుట కల్ల;
అడలి బెదరింపులకు మానమెడలఁ జేసి కప్పము నొసంగుటయు నంతకంటెఁ గల్ల.
గీ. మంచియో చెడ్డయో విక్రమించి సంగరమ్ము సేయఁగ నుంటిమి మమ్ముఁ జంప
వలయు, మీరైనఁ జావంగ వలయుఁ గాని రణము విడనాడి పాఱిపోరాదు సుమ్ము.
గీ. వచ్చినాఁడవు మాకోటఁ బట్టుకొనఁగ నెలమిఁ గొండంత యాసతోఁ; నివటజుము
గాంతునో చెప్పఁజాలము; కాని రణము మాని పోకుము తలవంపు లౌను మాకు.
గోవులఁ గన్నఁ ద్రెక్కొను తురుష్కులందు వాఁడాలఁ గొల్చెడి రాచగోల యుద్ధ
విగ్రహారాధన వెక్కిరించును వాఁడు విగ్రహమ్ములఁ గొల్వ వెలఁది యద్ది

విప్రవర్యులకుఁ బెన్నొతలు గూర్చును వాఁడు ద్విజులఁ బూజించెడి తెరవ యద్ది
కరము నాసక్తితోఁ గల్లు ద్రావును వాఁడు కలుగాంచి రోసెడి కలికి యద్ది

గీ. కఠిన హృదయుఁడైన కలుషుఁ దురకవాఁడు కుసుమకోమలమతి రాచగోల యద్ది
అరయఁ గలదన్నిటను భేదమట్టియెడలఁ గటకటా! యిర్వురకు నెట్లు కలిసెనొక్కొ.

గీ. కలదు శౌర్యమ్ము దెంతైనఁ గలదు బలము కలదు సాహసమెంతేనిఁ గలదు తాల్మి
ఎట్టి శౌర్యాదు లుండిన నేమి లోభివాని ధనమయ్యె మనకున్న వాఁడి యిపుడు.

గీ. కన్బడదు వామకరమునఁగల కరాసి యొకటఁ గాన్పించుఁ గుడి చేత నున్న కత్తి
చేరఁబోయిన తురకల శిరము లెల్లఁ బుడమిపైఁ బడుఁ గొబ్బరి ప్రుచ్చెలట్లు.

గీ. ధైర్యబలశాలివంట, యవార్యశౌర్యవంతుఁడవు నఁట, యభిమానవంతుఁడ వఁట
తురక పీరుని కూర్మి పుత్రుఁడవు నంట, కత్తిఁ గలుపుమి చూతు నీ ఘత్తు వేమొ.

సీ. రణశూరయైన దుర్గావతి కడు స్వతంత్రించి రాజ్యమ్ముఁ బాలించు చుండెఁ
దురక తోఁడగు విజాపుర నవాబును స్వతంత్రించి రాజ్యమ్ముఁ బాలించు చుండె
ఘనుఁడైన గోల్కొండమనుజేంద్రుఁడును స్వతంత్రించి రాజ్యమ్ముఁ బాలించుచుండె
నీ బందుగులు తక్క నిఖిల రాజన్యులు మించి రాజ్యమ్ముఁ బాలించు చుండ్రి

గీ. తొడరి స్వాతంత్ర్యమునకు నీతోడ నిప్పుడతి ముదము మీఱ మేము పోరాడుచుంట
తెలియదే యించుకయు హిందు దేశమునకు నగ్బరూ! చక్రవర్తి వెట్లౌదు వీవు

సీ. జలధిలో నవలీలఁ జరియించు నోడ నింతసె ముంపఁ జిన్ని రంధ్రమ్ము చాలు
శైల సమ్మితమైన తూల రాశినిఁ గాల్ప నలుసంత యగ్ని కణమ్ము చాలుఁ
గడవంత గుమ్మడి కాయ ముక్కలు గాఁగ వెసఁ జేయఁ జిన కత్తి పీఁట చాలు
బహుళ సత్కీర్తి విధ్వంసమ్ముగా నొనర్పఁగ నొక్క దుష్ప్రవర్తనము చాలు

గీ. పెక్కు అతి కష్టమునఁ గూడఁ బెట్టినట్టి కాసు నంత వెచ్చింప నొక్కండె చాఁ
నట్లె లక్షాధికమైనయట్టి నీదు సేనఁ బరిమార్ప మా చిన్ని సేన చాలు.

ఉ. పౌరుష మే ప్రధానమగు బాహుజ వంశమునం జనించితిన్
బూరుషుఁడే యనంగ గడుఁ బోటు తనమ్మును గల్గి యొప్పితిన్
వీరుఁడ వైతి వేని నతి వేగమ రమ్మని పిల్చియుంటి నిన్
బోరఁగ నట్టి నన్నెదిరి పోర నధర్మ మదెట్లు అయ్యెడిన్?

వలయువారు,— మానేజరు, కలాభివర్ధని,

రాయవరము, కోట రామచంద్రపురం పోష్టు, గోదావరి జిల్లా, (అని వ్రాయవలె

త్వరపడుఁడు! | త్వరపడుఁడు!
వెలసులభము! | ఫలమధికము!

# పాణిగృహీతా శ్రవణానంద శృంఖల.

---

ఇది తిరుపతి వేంకటేశ్వరకవుల పాణిగృహీతకును శ్రవణానందమునకును విమర్శ గ్రంథము. ఆంధ్ర దేశమునఁ జొచ్చి యీరెండు గ్రంథములు నాంధ్రులకెంత యవమానమును గలిగించినదియు నీగ్రంథము విస్పష్టముగఁ దెలుపును. ఇది నిష్పక్షపాతముగ వ్రాయఁబడిన యుద్గ్రంథము. ఈగ్రంథ మాంధ్ర భాషా పరిజ్ఞానార్థులకు నిర్దుష్టమగు సాహిత్యమును సులభముగఁ గలిగించును. నిర్దుష్టములను భ్రాంతిచే ననేక కవులు ప్రయోగించు ప్రయోగము లిందు వందల కొలఁది విమర్శింపఁబడినవి. ఇది పండితులు, కవులు, విద్యార్థులు నెల్లఱుఁ జదువఁ దగినది. ఇది విద్యార్థులకు నిర్దుష్టాంధ్ర సాహిత్యమును, గవులకు సరస కవిత్వమును, బండితుల కపారామోదమును గలిగించును. త్వరపడినఁగాని ప్రతులు చిక్కవు. చక్కని సులభ శైలి. నునుపు కాగితముల పయిని జక్కఁగ ముద్రింపఁబడును. సర్వాంగ సుందరమగు నీగ్రంథ మించు మించు ౧౦౦ పుటలుండును. వెల రు ౦-౬-౦ లు.

వలయువారు,—

 మానేజరు, కలాభివర్ధని,

రాయవరము, కోట రామచంద్రపురం పోష్టు,

గోదావరి జిల్లా. (అని వ్రాయవలెను

## రామదేవ విజయము. ౦-౬-౦.

ఇది యొక నాటకము. రెడ్ల చరిత్ర. కథా కల్పన మత్యద్భుతము. రెడ్ల సంభాషణము విని తీరవలెను. వీర రస పరిప్లుతము. రెడ్ల శౌర్య మిందుఁ జక్కఁగఁ బ్రదర్శింపఁ బడినది.

సీ. కలికి రూపముల ముద్దులు మూటఁ గట్టెడి గువ్వ పిట్టల పెందుఁ గూల్చుటయును
గుఱుకుఁ గత్తులు గాళ్లఁ గట్టి పందెము వైచి వెసఁ గోడిపుంజుల విడుచుటయును
బూరి మేయుచు సాధువు లటంచుఁ బేరొందిన కోమరారు లేళ్లను గూల్చుటయును
రమ్యమైనట్టి పారావతాదిక పక్షి వితతిపై డేగల విడుచుటయును

గీ. నని తలఁచిరేమొ రాచవా రాహవమునఁ గదనరంగమ్ము ప్రాణాంతకమ్మటంచుఁ
గలన భూమంచిరెల్లు సింగము లటంచు నెఱుఁగ రీ రాచవార లొక్కింతయేని.

ఉ. పాఱుఁడు, మౌని, యొక్కఁ డగు భార్గవ రాముని తో నెదిర్చియే
పోరఁగ లేక యెల్లరును భూస్థలిఁ గూలిరి రాచవారు; స
ద్వీరులు, శౌర్యభూషితులు, పెక్కురునౌ మన రెడ్డి వీరులన్
బోరి జయించి వైచెదరు పోలును పోల్పఁగరే! రాచవారికిన్.

ఉ. బాలుఁడనో, విరోధి నరపాల సమాజము దూల్చి వైచు నా
కాలుఁడనో, యెటింగదరు ఖడ్గముఁ జేకొని, భీతి దక్కి, యీ
శ్వేల మదమ్ము మీఱఁ మది; వీర విహారము సేసి వైరిభూ
పాలురఁ గ్రుంచు నప్పుడిది వచ్చెడి మీసము సుమ్ము క్రొత్తగన్.

ఆ. రెడ్డి వీరులొండె రేఁగి సుక్షత్రియ వీర వర్యులొండె విజయ లక్ష్మిఁ
బొందవలయుఁ గాని పోరాడ లేక వ్యర్థముగఁ బోవు వారె రాచవారు?

## గుణమంజరి. ౦-౩-౦.

ఇందుఁ గామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యము లను షడ్గుణము లు వర్ణింపఁ బడినవి. ఇట్టి గ్రంథ మేభాష యందును లేదు. ఇది కథా సంబంధ మెంత మాత్రమును లేక పోయినను జక్కని యొక నవల వలె నుండును. మృదు మధుర శైలి. ఆ యా విషయము లతి స్వభావ సిద్ధముగను, నతి విస్పష్టముగను వర్ణింపఁ బడినవి. త్వరపడినఁ గాని ప్రతులు చిక్కవు.

రు ౦-౬-౦ లకు తక్కువ వి. పి. చేయఁబడదు.

పత్రియువారు,— ☞ మానేజరు, కలాభి వర్ధని,

రాయవరము, కోట రామచంద్రపురం పోష్టు, గోదావరి జిల్లా. (అని వ్రాయవలెను)

---

శ్రీ భారతీ తిలక ముద్రాక్షరశాల, రాయవరము.